

# చైతన్య గీతికలు


చైతన్య గీతికలు
స్వామి సుందర చైతన్యానంద
(సర్వ స్వామ్యములు ట్రస్టువి)
ప్రతులకు :
సర్వజ్ఞ కల్చరల్ ట్రస్ట్
సుందర చైతన్యాశ్రమం
హైదరాబాద్ - 500 043.
☎: (08418) 255777
(08418) 255355
డి.టి.పి. & కవర్ డిజైనింగ్
సుందర చైతన్యాశ్రమం


స్వామి సుందర చైతన్యానంద

# నవ్విన పువ్వులు

మధురమైన భావాలను
సుమధురమైన పదజాలంలో తురిమి
మృదుమధురమైన కవితా పల్లకీలో కూర్చోబెట్టి
ఊరేగించేదే కవిత్వమైతే,
దానికి ముందు మాట రాసేందుకు
కవిగా నేను ముందుకు రాలేను.
మీ ముందుకు రాలేను.

కవిత్వ మనేది కేవలం సమదర్శనమే నని
కవి ఏనాడైనా క్రాంతదర్శియే నని
నిజాలను ప్రదర్శించే యత్నంలో
ఋజువులను సృష్టించే ప్రయత్నంలో
యోజనాలను దూరాలుగా, భారాలుగా భావించక
ప్రయోజనాలనే భవ్యంగా, భావ్యంగా తలచి

జననాడిని కుదిపి
జీవనాడిని తెలిసి
జీవన స్రవంతి నిరాటంకంగా సాగేందుకు

అవరోధాలను తొలగించి
రేపటి ఆశకు తెరదించి
నిన్నటి నిరాశకు సమాధి కట్టి
నేటిని మేటిగా నిలిపేందుకు

సర్వాన్ని సర్వంలో కలిపేందుకు - కవిత్వమొక సాధనమైతే,
కవిగా నేను సాధకుణ్ణి.
సాధ్యాన్ని కూడా.

అవలోకించే వారికి సుందర వనాన్ని
అందచేరే వారికి చైతన్య నిలయాన్ని
ఆస్వాదించే వారికి ఆనందాలయాన్ని.

ఈ వనంలో
విరబూసిన వేదాంత సుమాలే చైతన్య స్వరాలు
ఈ నిలయంలో
విరజిమ్మిన విజ్ఞాన సౌరభాలే చైతన్య రాగాలు
ఈ ఆలయంలో
విరివిగ వితరణ చేయబడిన ప్రసాదాలే చైతన్య గానాలు.

ఈ పాటల్లో,
మంచి చెడుల మర్మా లున్నాయి.
ధర్మాధర్మాల సందడు లున్నాయి.
వివేకాన్ని పంచే అంగడు లున్నాయి.
పూజించేందుకు గుడు లెన్నో ఉన్నాయి.

వెల కట్టేందుకు యతిప్రాస లున్నాయి.
వెల కట్ట లేని యతి శ్వాస లున్నాయి.

మాసిపోని మాట లున్నాయి.
హద్దులు దాటిన పదా లున్నాయి.

తెల్లని కాగితాలపై తేలియాడే ఈ నల్లని రాతలు
కాలం చెల్లే రాతలు కావు. కాలంలో చెల్లని రాతలూ కావు.
ఇవి జ్ఞానక్షీరాన్ని అందించే మాతలు
తప్పకుండా తుడుస్తాయి మన తల రాతలు.

ఇందులో,
కవిలేడు. కవిత్వ ముంది.
గాయకుడు లేడు. గాన ముంది.
వేదాంతి లేడు. వేదాంత ముంది.
కర్త లేకుండా సాగిన కర్మ ఇది. యజ్ఞమిది. జ్ఞానయజ్ఞ మిది.

వసంతాన్ని చూచేందుకు కళ్ళు సరిపోతాయి.
అనుభవించేందుకు హృదయ ముండాలి.

సున్నితమైన ఒక హృదయం ఒలికించిన
కవితా సుధలను పట్టి నిలుపుకొనేందుకు
సరియైన పాత్ర మరొక సున్నిత హృదయమే.

హృదయేశుని రస మందిరమే.
సరసమయ నవరస మందిరమే.
సమరస మందిరమే.

*కలలను కరిగించే*
*కవితా ఉషస్సులో*
*ప్రార్థననే ప్రాణవాయువుగా పొందిన*
*ఓ కిరణం*

స్వామి సుందర చైతన్యానంద

# విషయ సూచిక

## పూజా ఫలము

### (చైతన్య గానం - 1)



## మువ్వల గోపాల

### (చైతన్య గానం - 2)



## నీ చరిత పాడుకోనా

### (చైతన్య గానం - 3)



## అందాల హరివిల్లు

### (చైతన్య గానం - 4)



## వందన మందుకో

### (చైతన్య గానం - 5)

## భలే భలే సృష్టి

### (చైతన్య గానం - 6)



## వెలుగుల తోరణం

### (చైతన్య గానం - 7)



## సర్వదేవ నమస్కారం

### (చైతన్య గానం - 8)



## పాడవే తుమ్మెద

### (చైతన్య గానం - 9)

## ఊరేగే మేఘమాల

## (చైతన్య గానం - 10)



## చందమామ రావే!

## (చైతన్య గానం - 11)







# పూజా ఫలము

## (చైతన్య గానం - 1)

### 1. శారదాం - విశారదాం

**పల్లవి :**

శారదాం! విశారదాం!
నమామి శుభదాం!
బుద్ధిప్రదాం! శారదాం! ॥ శారదాం ॥

**చరణములు :**

1. వేద వేదాంగ వేదాంత స్వరూపిణి!
అఖిల విద్యా స్వరూపా! సనాతని!
సకల కళాతీత మంగళ రూపిణి!
వాణీ విలాసిని వీణాపాణీ! ॥ శారదాం ॥

2. శమ దమాది సుగుణ ప్రదాయిని!
సంసారాబ్ధి దుఃఖహారిణి!
పాపనాశిని పద్మనివాసిని!
విశ్వధారిణి శ్రమ నివారిణీ! ॥ శారదాం ॥



3. త్వమేవ సంధ్యా గాయత్రీ
**ఓం భూర్భువః స్వః తత్సవితు ర్వరేణ్యం**
**భర్గోదేవస్య ధీమహి ధీయో యోనః ప్రచోదయాత్**
త్వమేవ సంధ్యా గాయత్రీ
సావిత్రీ చ సరస్వతీ!
గీర్వాణ జ్ఞాన సారరూపిణీ!
చైతన్య భగవతి వాగ్దేవి భారతి! ॥ శారదాం ॥



## 2. పావన యమునా జలములు చల్లన

**పల్లవి :**

పావన యమునా జలములు చల్లన
మోహన కృష్ణుడు నల్లన - మన
మోహన కృష్ణుడు నల్లన ॥ పావన ॥

**చరణములు :**

1. గోకులంబున నోముల పంట
గోవర్ధనమున భక్తుల వెంట
వడి వడి పరుగిడి అటు ఇటు పైబడి
నడయాడు కన్నయ్య - ఒడి వెచ్చన ॥ పావన ॥

2. రేపల్లె పురమున గోకుల చంద్రుడు
బృందావనమున గోపీ రమణుడు
తరుణుల పట్టి తరువులు చుట్టి
విహరించిన బృందావని - పచ్చన ॥ పావన ॥



3. క్షీరసాగర శయనా!
క్షీరమె నీకు కావలెనా?
వేదము కదిలిన నోటికి
వెన్నలు మన్నులు కావలెనా?
పాల కడలిలో వెన్న కుండలలో
ఉన్నది ప్రేమే తెల్లన
తేనెల కన్నా - తియ్యన ॥ పావన ॥



## 3. సత్యమైన నీ కథ విని

**పల్లవి :**

సత్యమైన నీ కథ విని
వినిపించింది మనసు మనవిని ॥ సత్య ॥

**అనుపల్లవి :**

పోయిన పున్నమి వచ్చిందని
చేసిన పున్నెము తెచ్చిందని ॥ సత్య ॥

**చరణములు :**

1. చెప్పుట కేమీ లేదని చెప్పక మన సుండ లేదని
మనసారా నీ కిచ్చిన మనసు
ఏనాటికి తిరిగి రాదని
నిన్నొదలి ఎన్నడు రాలేదని ॥ సత్య ॥

2. యెందరెందరో ఉన్నారని
అందరిలో నీవున్నా వని
యెన్నో మహిలో ఉండినా
మదిలో నీవే ఉంటా వని
నా మదిలో నీవే ఉంటా వని ॥ సత్య ॥



3. తోడెవరు నాకు లేరని
మిగిలిన నీడ నీవని
వీడక నీవు తోడుగ ఉంటే
ఈ జన్మకు ఇది చాలని
మరో జన్మము ఇక లేదని ॥ సత్య ॥

4. కలిసొచ్చిన విధి పోయిందని
కదిలొచ్చిన గతి తోడుందని
వెన్నుడు మదిలో ఒదిగి పోగా
కన్నులలో కాంతి వెలిగిందని
హృదిలో శాంతి నిలిచిందని ॥ సత్య ॥



# 4. వసంతం విరబూసిన గాని

**పల్లవి :**

వసంతం విరబూసిన గాని
చిగురించవు మోడు తరువులు

**అనుపల్లవి :**

నీ దయ మా యెద తాకిన గాని
విరబూయవు మా బ్రతుకులు ॥ వసంతం ॥

**చరణములు :**

1. లేనిది యిమ్మని అడగకు
మాకున్నది నీదే కాదనకు
కరుణను మాకు లేదనకు
నిను చేరే మమ్ము ఆపకు ॥ వసంతం ॥

2. రోజురోజుకు పెరుగు చున్నది
పుచ్చుకున్న బ్రతుకు ఋణము
క్షణాక్షణానికి తరుగు చున్నది
తెచ్చుకున్న దారి బత్తెము
యెంత తీర్చిన అసలు కరగదు
అమితమైన మిత్తి తరగదు
మనసు లేని యముడు వచ్చి
జప్తు చేయుట తప్పదు ॥ వసంతం ॥



3. ఉన్నది చెప్పకనే పోతూ ఉంది
రానున్నది తానే రాబోతుంది
పోయింది ఆయువు వచ్చేది మృత్యువు
నిలవని కాయము చావుకు తాయము
॥ వసంతం ॥

4. వెలుగులు చిమ్మే దీపము చుట్టూ
చీకటి వరించి చేరి నట్లు
నీతులు పలికే మనుషుల చుట్టూ
గోతులు గొప్పగ వెలిసి నట్లు
ముడతల దేహం మడతల చిత్తం
ముసలితనములో తప్ప నట్లు
సుందరమగు నిను నమ్మిన మాకు
ముందరగా అగుపించు టెట్లు ? ॥ వసంతం ॥





## 5. నల్లనివాడు - అల్లరివాడు

**పల్లవి :**

నల్లని వాడు అల్లరివాడు
చైతన్యుని యెదలో మాధవుడు ॥ నల్లని ॥

**చరణములు :**

1. వనమున పెరిగిన వెదురు కూనను
ముద్దుల మురళిగ మార్చాడు
మోహన వంశిని పలికించి
జగతిని మురిపించాడు
బృందావనిలో మురళీనాదం
భక్తుల పాలిటి అమృతగానం ॥ నల్లని ॥

2. చల్లను అమ్మే చెలువల వెంట
అల్లరి చేయుచు తిరిగాడు
నీవే దిక్కని నమ్మిన వారికి
గతియై పతియై నిలిచాడు
దీనులకు అతి దీనులకు
హీనులకు బలహీనులకు
గతిహీనులకు ఆలంబనము ॥ నల్లని ॥



3. పుణ్యము పండిన పార్థుని వెంట
రణభూమికి కదిలాడు
భక్తికి వశమై భక్తుని కొరకు
విజయ రథము నడిపాడు
ధర్మమును కర్మమును
యోగమును మోక్షమును
గీతను బోధించిన అచ్యుతుడు ॥ నల్లని ॥





## 6. పూజాఫలము నీకే ఉండనీ!

**పల్లవి :**

పూజా ఫలము నీకే ఉండనీ
పూజే ఫలముగ నాకు మిగలనీ

**అనుపల్లవి :**

సలిలము నిండిన నా నయనాలలో
కదలక నీ రూపు నిలిచిపోనీ ॥ పూజా ॥

**చరణములు :**

1. అందీ అందని అందము నీవు
అందుకోలేని ఆశను నేను
రెప్పలు కదలక చూచే కనులలో
నిండి పొరలే కన్నీటిని నేను ॥ పూజా ॥

2. నీ అడుగుల కడ పువ్వును నేను
నీ కృపతో విరిసే నవ్వును నేను
ఎవరిని కోరని యెదను నేను
నీకు దూరమై బ్రతకలేను ॥ పూజా ॥



3. నేనని నాదని బిగిసిన మనసు
నారికేళమై పగిలి పోనీ
కలతల గుండెను కుదిపిన మాయలు
నీటిధారలై కారి పోనీ ॥ పూజా ॥

4. ఏ తరువులకు పూచిన ప్రేమలో
నీ చరణముల ఒదిగిన పువ్వులు
నాలో విరిసిన ప్రేమ సుమాలు
నీ పదముల కడ చేరిపోనీ ॥ పూజా ॥



## 7. ఎంత నేర్చినా ఎలా బ్రతికినా

**పల్లవి :**

ఎంత నేర్చినా ఎలా బ్రతికినా
ఒక్కనాటికి వల్లకాటికి ॥ ఎంత ॥

**చరణములు :**

1. సొగసైన మేను సంక్రమించినా
అందమైన నారి అరుదెంచినా
ఉత్తములైన పుత్రు లుదయించినా
సిరిసంపదలతో తులతూగినా
ఒక్కనాటికి వల్లకాటికి ॥ ఎంత ॥

2. కమనీయ కవిత లెన్ని జేసినా
రమణీయ రూపు లెన్ని గాంచినా
అపురూప గళముతో గానము చేసినా
బండరాతిలో నిండు రూపు దీర్చినా
ఒక్కనాటికి వల్లకాటికి ॥ ఎంత ॥



3. కోరికల భ్రాంతి కదల కూడదు
కాష్టాన కాంతి మరువ కూడదు
గురుసేవ లేక గుర్తు తెలియదు
సమబుద్ధి లేక శాంతి మిగలదు
ఒక్కనాటికి వల్లకాటికి ॥ ఎంత ॥





## 8. పాల సంద్రమున పవ్వళించావా !

**పల్లవి :**

పాల సంద్రమున పవ్వళించావా
జాలి లేక నన్ను జార విడిచావా ॥ పాల ॥

**అనుపల్లవి :**

లోకాలు పాలించి అలసిన దేవా
గాలించ లేను మొర విని రావా ॥ పాల ॥

**చరణములు :**

1. యతుల సుమతుల వినతులు విని విని
విసిగి పోతివా స్వామీ!
మతులు మతాలు తెలియని భక్తుల
అండజేరి ఆనందముతో ॥ పాల ॥

2. బాహ్య జగము బాధలమయ మని
అంతరంగము భయరూప మని
ఆంతరిక భక్తియే అభయప్రద మని
సరి చెప్పుటకు సిరితో గూడి ॥ పాల ॥



3. భక్తుల తాపాలు, అభక్తుల పాపాలు
సంసారుల పరితాపాలు
చూడ లేక ఘోరం దించ లేక భారం
సార మెరిగిన రసరూప మూర్తివై ॥ పాల ॥

4. తల్లిదండ్రి గురువు దైవం నీ వని నమ్మిన
నాలో దోషము నీ కగుపించెనా?
నా భావ మెరిగిన మహానుభావా!
కడలిని వదలి నా కడకు రావా! ॥ పాల ॥



# 9. బృందావనిలో నంద నందనుని

**పల్లవి :**

బృందావనిలో నంద నందనుని
మ్రోగిన మోహన మురళి
చైతన్య సుందర రవళి ॥ బృందావనిలో ॥

**చరణములు :**

1. ఆ రవమును విని
ఆనందము గని
తన్మయ మైనది గోపిక
తనువును మరచింది రాధిక ॥ బృందావనిలో ॥

2. ఆ రాగము విరాగము నింపగ
ఆ నాదము వికాసము దింపగ
కదిలింది చైతన్య గీతిక
అల్లింది సుందర మాలిక ॥ బృందావనిలో ॥



3. జీవన సరళిని పలికింది మురళి
బ్రతుకు బాటను నేర్పింది నెమలి
బోధను పలికింది నాలుక
పరవశ మైనది వేదిక
పొంద దగినది లేదిక ॥ బృందావనిలో ॥





# మువ్వల గోపాల

## (చైతన్య గానం - 2)

### 10. మువ్వల గోపాల - చిరునవ్వుల గోపాల

**పల్లవి :**

మువ్వల గోపాల
చిరునవ్వుల గోపాల

**అనుపల్లవి :**

ఏటికి మాటను - గాలికి పాటను
ఓర్పుతో నేర్పిన భక్త మందార! ॥ మువ్వల ॥

**చరణములు :**

1. వన్నెల చిన్నెల గోప కన్నియల
మనసులు దోచిన మాయాలోల
మోహన గోపాల
మనమోహన గోపాల ॥ మువ్వల ॥

2. పున్నమి వెన్నెల నవ్వుల మాటున
నాట్యము చేసిన రాసవిలోల
మురళీ గోపాల
వేణురవళీ గోపాల ॥ మువ్వల ॥



3. గొల్ల పిల్లలకు అల్లరి సుద్దులు
బుద్ధిగ నేర్పిన బాలగోపాల
ముద్దుల గోపాల
వెన్నముద్దల గోపాల ॥ మువ్వల ॥

4. బృందావనిలో అందా లొలుకుచు
చిందులు వేసే నందకిశోర
నందగోపాల
ఆనంద గోపాల ॥ మువ్వల ॥



## 11. మరువలేను - మరపు రానీను

**పల్లవి :**

మరువలేను - మరపు రానీను

**అనుపల్లవి :**

ఇందిరా మందిరా భక్త సుందరా!
కర్పూరమై నీలో కరిగి పోనీరా! ॥ మరువ ॥

**చరణములు :**

1. మురళీ రవముతో ముల్లోకాలను
మై మరపించే మోహనబాల! ॥ మరువ ॥

2. ఊపిరి సలపని ఊహై నిలిచావు
ఊహల కందని ఉనికై మిగిలావు ॥ మరువ ॥



3. ఉరుపై ఉరిమావు
మెరుపై మెరిసావు
చినుకైన కురవని
మబ్బై మిగిలావు ॥ మరువ ॥



## 12. సాధన సాగనీ స్వామీ

**పల్లవి :**

సాధన సాగనీ స్వామీ
వేదనలన్నీ ఆగి పోనీ ॥ సాధన ॥

**చరణములు :**

1. గాలిమేడలు కట్టు గాలి మనసు
గాలి పోగానే జాలి బ్రతుకు
నిలకడ లేని నీటి బుడగిది
కడకు నిలువునా కాలి పోతది ॥ సాధన ॥

2. అడు గంటు చుండె ఆయువు తైలము
కొడి గట్టు చుండె జీవన దీపము
సమయము కాదిది ఏమరుపాటుకు
కాలము కాదిది ఏ పొరపాటుకు ॥ సాధన ॥



3. మనసు కోడెనాగు - వయసు కొండవాగు
సొగసు కారుమబ్బు - తెలుసు వాటి రూపు
మంటల మయము కాటిలో కాయము
ఏ దేహమైనా ఇదే చివరి న్యాయము ॥ సాధన ॥



## 13. సుందర సురభిళ యమునా తీరవనం

**పల్లవి :**

సుందర సురభిళ యమునాతీర వనం
నంద నందనుని రసమయ రాగధనం ॥ సుందర ॥

**చరణములు :**

1. చుక్కలెన్నో చుట్టు మూగినా
కలువను వలచెను తారాపతి
భామల నడుమ తాను నిలిచినా
రాధను తలచెను రమాపతి ॥ సుందర ॥

2. కొండనెత్తిన మోహనబాల
భక్తుల బరువును దించెడి లీల
శ్యామసుందరుని గాంచెడి వేళ
కంటిని మూసే రెప్పలు ఏల? ॥ సుందర ॥



3. గిరిధారి అడుగిడు దారియు కాలేక
మురారి పూజలో కుసుమము కాలేక
తపియించిన చైతన్యుని మదిని
వికసిత నందన వనముగ మార్చిన ॥ సుందర ॥



## 14. గాలికి లోటున్నదా?

**పల్లవి :**

గాలికి లోటున్నదా?
ఏటికి పోటున్నదా?
మంచిని తెలిసి
సమతను పిలిచే
మనిషికి కొర తున్నదా? ॥ గాలికి ॥

**చరణములు :**

1. పువ్వుకు మనసున్నదా?
నవ్వుకు వయసున్నదా?
నువ్వు నే ననే భేదము చూసే
బ్రతుకుకు సొగసున్నదా? ॥ గాలికి ॥

2. పక్షికి ఊరున్నదా?
అక్షికి నోరున్నదా?
మచ్చిక తెలిసి మనుగడ నడిపే
కుక్షికి కరువున్నదా? ॥ గాలికి ॥



3. మబ్బు మెరయ కుండునా!
జల్లు కురియ కుండునా!
భక్తి ప్రేమలు మనసున నిలువగ
ముక్తి లభించ కుండునా? ॥ గాలికి ॥



## 15. హే గోవింద! హే గోపాల!

**పల్లవి :**

హే గోవింద! హే గోపాల!
హే దయామయా!
కరుణ జూపి కనికరింప
కదలి రావయా! ॥ హే గోవింద ॥

**చరణములు :**

1. పాము పడక మంచి గాదు
ఎంచి చూడ ఏనాటికైన
మెత్త నైన నా యెడద ఉండగ
పాము లెందుకు పరమ పురుష!
నిదుర పోరా! నీరజాక్ష!
సద్దుసేయను సరసిజాక్ష! ॥ హే గోవింద ॥

2. పుట్టించమని అడిగినానా!
పుట్టించితే అలిగినానా!
ఏ మడిగానని ఏవగింపు
ఏ దడిగానని చీదరింపు
మాయ లెరుగని మనిషి నేను
మర్మ మెరుగని నీ మనిషి నేను ॥హే గోవింద ॥



3. వెలుగు లోన జగతి నిలిపి
వెలుగు వెంట చీకటి కదిపి
వెలుగు నీడలు వీడి పోవని
కష్టసుఖాలు వీడ లేవని
వాసుదేవుని వీడ కండని
స్ఫూర్తి నిచ్చిన జ్ఞానదాత ॥ హే గోవింద ॥



# 16. ఆశా నిరాశల జీవితమింతే

**పల్లవి :**

ఆశానిరాశల జీవిత మింతే
కష్టసుఖాల అతుకుల బొంతే ॥ ఆశా ॥

**చరణములు :**

1. తరువుకు ఛాయ - జీవికి మాయ
కడలి లోన కెరటాలుగ
ముడిపడి ఉన్నవి అనాదిగ
జన్మ జన్మల పునాదిగ ॥ ఆశా ॥

2. అందాల బ్రతుకు - అద్దాల మేడ
ముక్కలౌను ఒక్క క్షణాన
చెప్పిరావు చేసినవి
జరిగిన వన్నీ తప్పనివే ॥ ఆశా ॥



3. తానొక గొప్పని నీళ్ళను బాధించు
నిప్పును నీరు ఆర్పక పోదా
పొంగే దెపుడూ క్రుంగుటకే
నిప్పు లాంటి సత్యమిదే ॥ ఆశా ॥





## 17. కావగరావా! కరుణింపగ లేవా!

**పల్లవి :**

కావగరావా! కరుణింపగ లేవా!

**అనుపల్లవి :**

భక్తే గాని ముక్తి ఎరుగని శక్తిహీనులం
అతిదీనులం - బలహీనులం ॥ కావగ ॥

**చరణములు :**

1. వెన్నలాంటి నీ మనసు
మిన్నకున్న దేమి స్వామి
మా నొసటి రాతలు అడ్డుకున్నవా ఏమి?
అందరి వాడవా!
మా కందని వాడవా? ॥ భక్తే గాని ॥

2. పువ్వులలో దారము వోలె
ఒదిగి పోయినావా స్వామీ!
పువ్వుల సువాసన వోలె కానరాక ఉంటివా?
వినిపించే స్వామీ - మాకు కనిపించ వదేమి?
చెవులు చేసిన పుణ్యమేమి?
కన్నులలో పాపమేమి? ॥ కావగ ॥



3. ముక్కువతో మనసు కుక్కను
చేరదీసి పెంచినాను
తిండేమో నా ఇంట కాపలా పరుల ఇంట
ఇదేమి చోద్యమో! దీని కేది వైద్యమో!
నా హృదయము లేత దాయె
బాధ లేమొ కోత లాయె ॥ కావగ ॥





## 18. కరుణించు నా స్వామి !

**పల్లవి :**

కరుణించు నా స్వామి
కనికరించ వదేమి?
ఆశ్రయించితి స్వామి
ఆలసించెద వేమి? ॥ కరుణించు ॥

**చరణములు :**

1. పువ్వులలో నవ్వులలో
వెలిగేటి నా స్వామి
పాల మనసును తెలిసి
పలుక రావేమి? ॥ కరుణించు ॥

2. ఆ చూపు చల్లదనం
ఆ నవ్వు తెల్లదనం
ఆ చరణములె సర్వం
నయనాల కది పర్వం ॥ కరుణించు ॥



3. వైకుంఠ మందున
వెలిగేటి నా స్వామి
దారి చూపే తండ్రి
దారి గని రావేమి? ॥ కరుణించు ॥





## 19. ఉన్నది గాంచవె ఓ మనసా!

**పల్లవి :**

ఉన్నది గాంచవె ఓ మనసా!
వేరొండు లేదనే సత్యము తెలుసా! ॥ ఉన్నది ॥

**చరణములు :**

1. లేని నాడు ధన మొకటే లేదు
ఉన్న నాడు మరి లేనివి ఎన్నో!
ఎన్నున్నా - ఆశ కదిలితే
పండని కాయె ఆ బ్రతు కెపుడు ॥ ఉన్నది ॥

2. తాను అందముగ నేసిన గూడు
తననే మూసిన వైనము చూడు
ఆశలు మదిలో కదిలిన నాడు
సాలీడే మన దారికి తోడు ॥ ఉన్నది ॥



3. రెంటికి నడుమ చోటున్నాది
దాటే వారికి అది తెలిసి
మది నిలిపి దాటిరి పెద్దలు ఆవలికి
॥ ఉన్నది ॥



# నీ చరిత పాడుకోనా

## ( చైతన్య గానం - 3 )

### ౨౦. నిను గని పూజించు జనులు

**పల్లవి :**

నిను గని పూజించు జనులు ఘనులు
నిజముగ భువిలో వారే ధన్యులు ॥ నిను ॥

**చరణములు :**

1. నీ విభవము గని పులకరించిన
ఆకాశమె అనంత మాయె
తీపి తలపులతో తూగిన లతలు
పూజా వేళకు పువ్వులు తొడిగె ॥ నిను ॥

2. దీపారాధన అర్కుని పుణ్యము
మాల సమర్పణ హరివిల్లు భాగ్యము
నిండు మనసుతో పండు జాబిలి
హారతు లిచ్చి నిను అర్చించె ॥ నిను ॥



3. పొంగే తరంగాల అంగాలు చాచి
నీ అడుగుల పడినది గంగమ్మ తల్లి
కులుకుల పైటను మెల్లగ పరచి
తన ఒడిలో దాచెను యమునాదేవి ॥ నిను ॥

4. మ్రోగుచున్నవి గుడిలో గంటలు
మోయుచున్నవి గుట్టుగ గాలులు
తడుపు చున్నవి చల్లని వానలు
తన్మయ మైనవి చైతన్య తలపులు ॥ నిను ॥



## 21. ఇలకు దీపము నీవె

**పల్లవి :**

ఇలకు దీపము నీవే
కలకు జీవము నీవే - నీవే - కృష్ణా! ॥ ఇలకు ॥

**అనుపల్లవి :**

ఇలలో కలలు కరిగిన చోట
మిగిలిన ఆశారూపము నీవే ॥ ఇలకు ॥

**చరణములు :**

1. సుడిగాలి ఒడిలో అలికిడి
గలగల పారే నదిలో సవ్వడి
నడి కడలిలో లేని అలజడి
నీవే నీవే బ్రతుకుకు సందడి ॥ ఇలకు ॥



2. కటకట లాడే కరువు నీవే
రెపరెప లాడే తరువు నీవే
నీరు నిండిన చెరువు నీవే
అందరికి బ్రతుకు తెరువు నీవే ॥ ఇలకు ॥

3. తలచిన వారికి హాసము నీవే
తలవని వారి పరిహాసము నీవే
కాలములో మాసము నీవే
కలిగిన వారి ఆయాసము నీవే ॥ ఇలకు ॥





## ౨౨. నా మనసొక చిన్నగది

**పల్లవి :**

నా మన సొక చిన్న గది
అది నీకే సరిపోతది ॥ నా మనసొక ॥

**అనుపల్లవి :**

నీ పాదము మోపగనే
అది బ్రహ్మాండ మంతౌతది ॥ నా మనసొక ॥

**చరణములు :**

1. అది ఊహలు పరచిన వెన్నెల
మది ఊరేగించిన ఊయల
ఊయల నెక్కి వెన్నెలలో
విహరించగ రావా మాధవ ॥ నా మనసొక ॥

2. అంబరానికి అవధి లేదు
చిదంబరానికి రూపు రాదు
కలిమిలేములు కలలు గావా
మాకు నీవే బలిమి దేవా ॥ నా మనసొక ॥



3. పెట్టుట కేమి లేదురా
పెట్టే దండమె నాదిరా
రా రా రేపల్లె బాలుడా
వచ్చి పోకురా గోపాలుడా ॥ నా మనసొక ॥

4. పుణ్యమె నా తోడున్నది
మోక్షమె నాకు మేలైనది
ఉన్నవారికి ఏమున్నది ?
నీ లోనే ఎన్నటికి నేనున్నది ॥ నా మనసొక ॥



## 23. ఎటులనో! ఏగుటేలనో!

**పల్లవి :**

ఎటులనో! ఏగుటేలనో!
ఆ పొరపాటు - ఈ గ్రహపాటు ॥ ఎటులనో ॥

**చరణములు :**

1. శరధిని దాటిన దాశరథి
భవ జలధికి వారధి
నాకమైనా నరకమైనా
ఆ సన్నిధి అక్షయ నిధి ॥ ఎటులనో ॥

2. లోపల నిప్పు ఆరి పోగా
వెలుపల నిప్పు కాల్చి పోదా!
కాల కడలిలో ఎవరికి ఎవరు?
యమునా తీరమె అందరు ॥ ఎటులనో ॥



3. ఇచ్చినట్లే బ్రతుకు నిచ్చి
నిద్రలో సగమును దోచినావా!
వడ్డీ బుద్ధిని వదలని వరదా!
అసలు ఏమిటో తెలుపవా! ॥ ఎటులనో ॥

4. గుట్టలు దాటి గుంటలు నింపి
జలము నీరధిని చేరదా!
కర్మలు కరిగి మమతలు మరిగి
నా మది నీ దరి చేరదా! ॥ ఎటులనో ॥



## 24. శ్యామసుందర వదనం

**పల్లవి :**

శ్యామసుందర వదనం భజేఽహం
బుధజన హృదయ సరోజ నివాసినం ॥ శ్యామ॥

**చరణములు :**

1. ఆముక్త మౌక్తిక మణిమయ భూషణం
సుర నర వర శ్రిత కరుణాభరణం
వనజ నయనం పరమానంద రూపం
మునిజన సురగణ వందిత వదనం ॥ శ్యామ ॥

2. రతిపతి శతకోటి రమణీయ రూపం
బ్రహ్మ సుపూజితం బాలేందు తేజం
సంతత స్మరణానంద కందం
స్మరామి ముఖ కమల మిందీవర నీలం ॥శ్యామ॥



3. అమల కమల కోమల వర్ణం
పూర్ణ దయామృత సాగర రూపం
ఉత్ఫుల్ల కమల దళాయత నేత్రం
భజామి సుందర వదన సరోజం ॥ శ్యామ ॥



## 25. పాడినా నీ పాటలే

**పల్లవి :**

పాడినా నీ పాటలే
మాటాడినా నీ మాటలే ॥ పాడినా ॥

**అనుపల్లవి :**

ఎన్ని జన్మల పుణ్యఫలమో
యెద నిండా నీ తలపులే ॥ పాడినా ॥

**చరణములు :**

1. చూడాలని నా కనులు - నిను
చూపాలని కనుపాపలు
అసువులు బాసే వేళ లోగా
నీ రూపే చూపు కావాలని ॥ పాడినా ॥

2. నేలపై మనసు నేను
నింగిలో మహిమ నీవు
భాను డున్నది గగన మైనా
పేద కమలము నోచుకోదా ॥ పాడినా ॥



3. నేను నీవను భేదమేల
నీవు నాలో నిలిచిన వేళ
దారి బత్తెము నామము
మోక్షపదమె గమ్యము ॥ పాడినా ॥

4. చెదిరి పోయిన చిత్తములో
శాంతి నింపును నీ భావము
దాసహృదయ చైతన్యము
వాసుదేవుని నిలయము ॥ పాడినా ॥



## 26. శ్రీధర నారాయణ జనార్దన

**పల్లవి :**

శ్రీధర నారాయణ - జనార్దన
వందే అంబుజదళ లోచన - రామా! ॥ శ్రీధర ॥

**అనుపల్లవి :**

మునిజన పోషక! మురాసుర నాశక!
ఆశ్రిత వత్సల! అనంత శయన! ॥ శ్రీధర ॥

**చరణములు :**

1. పతిత పావన! దీన జనావన!
శ్రీ రఘునందన! పరమ దయాఘన!
ఆదిపురుషా! ఆశ్రిత రక్షక!
అప్రమేయ వరద! ఆత్మారామా! ॥ శ్రీధర ॥

2. రాక్షస మర్దన! రఘుపతి రామా!
సాధుపోషక! సీతారామ!
కపివర సేవిత కరుణారామా!
కోమలనేత్ర! కోదండరామా! ॥ శ్రీధర ॥



3. అహల్యోద్ధారక! ఆనందరామ!
రాజీవలోచన! రాజారామ!
మునిజన రక్షక! మంగళ రామా!
చైతన్యార్చిత సుందర రామా! ॥ శ్రీధర ॥



## 27. రాధను - నీ రాధను

**పల్లవి :**

రాధను - నీ రాధను
ఆరాధన చేసే రాధను
నీ రాధను - నిరపరాధను ॥ రాధను ॥

**చరణములు :**

1. నీ పద కమలాల అలరారుటకు
ఎదురు చూచిన మొగ్గను - నేడు
యెద విరబూసిన పువ్వును ॥ రాధను ॥

2. నీ గుడి ముంగిట వెలుగు చిమ్ముటకు
వేచి యుండిన వత్తిని - నేడు
కాంతి నింపే జ్యోతిని ॥ రాధను ॥



3. నీ మందిరమున రాగా లొలికే
పల్లవి కదిలిన పాటను - నేడు
చరణము కదిలే బాటను ॥ రాధను ॥

4. నీ అడుగుల కడ పడి ఉండాలని
కలలు కనిన ముగ్గును - నేడు
మనసు మురిసిన సిగ్గును ॥ రాధను ॥



## ౨౮. నీ చరిత పాడుకోనా

**పల్లవి :**

నీ చరిత పాడుకోనా
మనసార వేడుకోనా

**అనుపల్లవి :**

నా శ్రమలు తీరిపోగా
తొలి భ్రమలు పారిపోగా ॥ నీ చరిత ॥

**చరణములు :**

1. కట్టినాను నీ కొరకే
పూల గూడు నా మదిలో
వచ్చెదవని ఎదురు చూచితిని
వచ్చి ఉంటివని ఎరుగ నైతిని ॥ నీ చరిత ॥

2. మనసు నిండా నీవేలే
నా హృదయ మంతా నీదేలే
తొంగి తొంగి కళ్ళు చూడనీ
పొంగి పొంగి మనసు పాడనీ ॥ నీ చరిత ॥



3. ఇలలో విరబూసిన కళ
నెల నెల వెన్నెల
వెలయించినావు నమ్మి నందుకు
అన్ని కళలలో నన్నిలా ॥ నీ చరిత ॥

4. నా మనసు వాడని పువ్వు
పరిమళమును దాని కివ్వు
అనంతమైన నీ వలపులో
నా తలపును చేర నివ్వు ॥ నీ చరిత ॥



## 29. రారా సుకుమారా

**పల్లవి :**

రారా సుకుమారా - ఏలుకోరా!
నన్నేలుకోరా!

**అనుపల్లవి :**

నందకుమార! మానసచోర!
కౌస్తుభ మణిహార! ఏలుకోరా!
నన్నేలుకోరా! ॥ రారా ॥

**చరణములు :**

1. ఎంత వేడినా నాపై దయరాదా
మరి మరి వేడుకొనుట మరియాదా
నీకు మరియాదా! ॥ రారా ॥

2. మాకు నీవే అండ! బ్రతుకే కలకండ!
మమ్ముద్ధరించే బంగారుకొండ ॥ రారా ॥



3. దండిగ మా వెంట నీవే తోడుండ
ఆరు పువ్వులుగ మా బ్రతుకు పండ
॥ రారా ॥

4. పొంగిన గుండెలు ఊగుచు నుండ
కొలువై యుండర మా గుండె నిండ
బంగారుకొండ - మా బ్రతుకు పండ
॥ రారా ॥



# అందాల హరివిల్లు

## (చైతన్య గానం - 4)

### ౩౦. చల్లని వెన్నెల నవ్వుల చిన్నా!

**పల్లవి :**

చల్లని వెన్నెల నవ్వుల చిన్నా!
తెల్లని వెన్నల మువ్వల నాన్నా!

**అనుపల్లవి :**

నీ కొరకే నే బ్రతికున్నా
నిన్నొదల లేను ఎవ రేమన్నా ॥ చల్లని ॥

**చరణములు :**

1. గంగా యమునా నర్మద చంద్రభాగా కావేరి
కృష్ణా జలాలలో జలక మాడి
నల్లని మేనున తెల్లని ముత్యాల
మాలలతో గుండెల్లో దాగిపోరా! ॥ చల్లని ॥

2. మల్లెలు మొల్లలు సంపంగి జాజులు
వాసనలు వెదజల్లి మురిపింప
నవరత్న మాణిక్య స్వర్ణఛత్రము క్రింద
మహరాజుగ మాలో వెలిగి పోరా! ॥ చల్లని ॥



3. పాలు మీగడలు తియ్యని జున్నులు
పనస నారికేళాదు లారగించి
వల్లవ తరుణులు ఉయ్యాల లూపుచుండ
ఊగుచు నిద్ర లోకి సాగిపోరా! ॥ చల్లని ॥

4. నారద తుంబుర శ్రీవ్యాస శుకబ్రహ్మ
అర్జున భీష్మాదులు అండ జేరి
మందర స్థాయిలో లాలిపాట పాడుచుండ
మా ముందర అందముగ నిద్రపోరా! ॥చల్లని ॥





## 31. నీవె - నీవె - నీవె - నీవె - నీవే

**పల్లవి :**

నీవే - నీవే - నీవే - నీవే - నీవే
నా యెద కదిపిన కళ నీవే ॥ నీవే ॥

**చరణములు :**

1. నా పలుకులలో కులుకువు నీవే
నాలో తియ్యని పలుకువు నీవే
హృదిలో తీరని వలపువు నీవే
మదిలో ఆగని పిలుపువు నీవె ॥ నీవే ॥

2. ప్రేమలు ప్రాకిన పందిరి నీవే
కలలు కరిగితే ముందర నీవే
బ్రతుకు లోని అందము నీవే
అందీ అందని చందము నీవే ॥ నీవే ॥

3. కవితల గుండెలో ప్రాణము నీవే
మమతల గుడిలో వాణివి నీవే
మనసున్న మనిషి నిదానము నీవే
మహిమను తెలిపే విధానము నీవే ॥ నీవే ॥



4. చీకటి చీల్చే వెలుగువు నీవే
వెలుగుల నార్పే చీకటీ నీవే
అంతము లేని కాంతివి నీవే
అనంతమైన శాంతివి నీవే ॥ నీవే ॥





## 32. అందాల హరివిల్లు నీ ఇల్లు

**పల్లవి :**

అందాల హరివిల్లు నీ ఇల్లు
చూచేందుకు నోచుకోవు మా కళ్ళు ॥ అందాల ॥

**అనుపల్లవి :**

సొంపైన ఊరేగింపు నిరంతరము
కనలే దెందుకో మా నేత్రము ॥ అందాల ॥

**చరణములు :**

1. ఊడుపు లన్నీ గాలుల కార్యము
తడుపు లన్నీ వానల క్రమము
ముగ్గుల ముత్యాలు నెలరాజు పుణ్యము
మురియని మనసు ఏనాటి పాపము? ॥అందాల ॥

2. కిలకిల నవ్వుచు ఎగిరే గువ్వలు
నీ సదనమున దోగాడు పాపలు
చుట్టే ఋతువులే నీ ఇంటి చుట్టాలు
విరియని చూపులు మా కంటి శాపాలు
॥ అందాల ॥



3. పూచిన పువ్వులే చిరుచిరు నవ్వులు
ఉరుముల రవములే కమ్మని పలుకులు
సెలయేటి గలగలలు తియ్యని రాగాలు
మానవ బ్రతుకులు మాయని గాయాలు
॥ అందాల ॥

4. కాలుడే నీ ఇంటి కాపలా
కాలమే దానికి దాఖలా
నిండాలి ప్రేమలు నలువైపుల
ఉండాలి చైతన్యం దరిదాపులా ॥ అందాల ॥



## 33. ఏ గొల్లవాడో ఈ పిల్లవాడు

**పల్లవి :**

ఏ గొల్లవాడో ! ఈ పిల్లవాడు
కల్ల బొల్లి మాటల చల్లనివాడు
అల్లరి చిల్లరి పనుల నల్లనివాడు ॥ ఏ గొల్ల ॥

***చరణములు :***

1. మన్ను తిను మొనగాడు సొగసరి వీడు
ఇది ఏలనిన తినలే దనువాడు
తన కన్నా వేరుగ తినుటకు ఏముందని?
చెల్లు పలుకును కల్ల తెలిసిన కపటాల తేడు॥ఏ॥

2. వెన్నలు వదలడు మల్లెలు మరువడు
వెన్నెల రాత్రులు కన్నెల వీడడు
ఉన్నవారని లేనివారని చూడని వాడు
మాయ లొలికేటి మనసైన వాడు ॥ ఏ గొల్ల ॥



3. తస్కరించు వేళ పట్టినారు భామలు
ఎత్తుకొని వచ్చిరి ఎవరికి వారుగా
తీరా చూడగ అన్ని రూపు లేకమై
తల్లి ఒడిలో ఒక్కడై వెలిగె
అద్వయమైన స్వరూపము తెలిపె ॥ ఏ గొల్ల ॥

4. సురులకు ప్రభువే నరులకు విభుడు
పుణ్యాల పంటగ రేపల్లె చేరాడు
ప్రేమను పంచాలని శాంతిని పెంచాలని
దోగాడు చున్నాడు దొరయైన వాడు
నమ్మినోళ్ళ ఇళ్ళ ముందు
మోక్షమై గోవిందుడు ॥ ఏ గొల్ల ॥



## 34. నిను మరచి నేను మనజాలరా

**పల్లవి :**

నిను మరచి నేను మనజాలరా! తాళజాలరా !
మాయలు చాలురా! మహిమను చూపరా ॥ నిను ॥

**చరణములు :**

1. బ్రహ్మాండంబులు నిండిన స్వామి
నా మొర వినవు కారణమేమి? ॥ నిను ॥

2. తొలినాడు బడిగంట
మరునాడు గుడిగంట
నీవే ఏనాడూ మా జంట ॥ నిను ॥

3. మారెను నా వయసు
మారదు నా మనసు
ఏనాటికైనా నీదేరా ॥ నిను ॥



4. నేనే యమునై కదలి రానా?
చరణ కడలికి చేరిపోనా - నీ
చరణ కడలికి చేరిపోనా? ॥ నిను ॥



## 35. మారిన దెవరు? మార్చేదెవరు?

**పల్లవి :**

మారిన దెవరు - మార్చే దెవరు?
మార్పు మనిషికి సాధ్యమా మనసా?॥ మారిన ॥

**అనుపల్లవి :**

కురిసే మబ్బును నిలిపే దెవరు?
మారే మనసును ఆపే దెవరు? ॥ మారిన ॥

**చరణములు :**

1. రమ్మని గాలిని పిలిచిం దెవరు?
పొమ్మని ప్రాణము తెలిపిం దెవరు?
గాలితో కదిలిన కోమల కాయము
కాటికి పొమ్మని చెప్పిం దెవరు? ॥ మారిన ॥

2. పాలకడలిలో కాలకూట విషము
ఎదురౌ తుందని ఎరిగిన దెవరు?
ఏ పాప మెరుగని కైలాసపతికి
గళమున గరళము నింపిం దెవరు? ॥ మారిన ॥



3. మనసును కదిపిన కమ్మని స్నేహాలు
కాలం తిరిగితే చిరిగిన వస్త్రాలు
నీడగ తోడుగ నిలిచిన వారిని
పగలతో ఎదురుగా నిలిపే దెవరు? ॥ మారిన ॥

4. నీది కానిది నీకు లేనిది
ఇవ్వలేరు ఇలలో దేవతలైనా
కర్కశమైన కౌరవపతిలో
మార్పును చూశాడా కేశవుడైనా ॥ మారిన ॥





## 36. హైలెస్సా! హైలెస్సా!

**పల్లవి :**

హైలెస్సా..........హైలెస్సా
వేదము నేనని తెలుసా!

**అనుపల్లవి :**

ఎన్నో ఎన్నో చెప్పి ఊరిస్తా
మరుక్షణమే బ్రతుకంతా మారుస్తా ॥ హైలెస్సా ॥

**చరణములు :**

1. సంసార తిమిరాలు చీలుస్తా
అజ్ఞాన జలములు పీలుస్తా
రాగద్వేషాలు రాల్చేస్తా
శాంతి ప్రేమలు నింపేస్తా ॥ హైలెస్సా ॥

2. మాయాజాలము నంతా గాలిస్తా
మోహజాలము నింక కాలుస్తా
ధర్మాలన్నీ నీకు చేరుస్తా
ధర్మము నే నని నేర్పిస్తా ॥ హైలెస్సా ॥



3. స్వర్గం నీకు చూపిస్తా
మోక్షం నీకు అందిస్తా
అంద మంతా చిందిస్తా
ఆనందం నీవే అనిపిస్తా ॥ హైలెస్సా ॥

4. భ్రమలు లేవని నిరూపిస్తా
బ్రహ్మమే ఉందని వినిపిస్తా
ఉన్నది చైతన్యం అనిపిస్తా
ప్రమాణమై నీకు కనిపిస్తా ॥ హైలెస్సా ॥





## 37. రాధారమణ రాదేల కరుణ?

**పల్లవి :**

రాధారమణ - రాదేల కరుణ!
దేవకీనందన - మాకేల వేదన! ॥ రాధా ॥

**అనుపల్లవి :**

జీవుల గమ్యము నీవే కావా!
బ్రతుకు సంద్రమున నీవే నావ! ॥ రాధా ॥

**చరణములు :**

1. హాయి నొసగు మాయ నేతి బీరకాయ
మమతా మాలిక బంగారు పిచుక
చితికిన బ్రతుకులు ఒలికిన కన్నీరు
జలక మాడ మన్నది జగతి కోనేరు ॥ రాధా ॥

2. నా దనుకుంటే అంతా నరకము
కా దనుకుంటే ఎంతో సుఖము
లే దనుకుంటే ఎక్కడి బంధము?
తోడు నీ వుంటే అదియే అందము ॥ రాధా ॥



3. ఒకనాటి పాపాలు రేపటికి రూపాలు
మనిషికి పీడలు మాయల నీడలు
వేదాంత వచనాలు వెన్నుని చరణాలు
వేదగోపాలుని నాదాభరణాలు ॥ రాధా ॥

4. నను కరుణించిన భక్తివి నీవే
నేను వరించిన ముక్తివి నీవే
నీ వెంట పడితే మిగలదు మోహము
నీవు వెంట రాగా వెలుగును మోక్షము
॥ రాధా ॥



## 38. హరి గోవింద

**పల్లవి :** హరి గోవింద - హరి గోవింద
పరమానంద ॥ హరి ॥

**అనుపల్లవి :**

పూర్ణదయాకర తాపత్రయ హర
జగన్నాథ శ్రీ పురుషోత్తమ హరి ॥ గోవింద ॥

**చరణములు :**

1. మీన కచ్ఛప వరాహ నరహరి
వామన భృగుపతి రామ బలభద్ర
కృష్ణ కల్కి దశనామము పలికి
తనువు పులకింప బ్రతుకు తరియింప ॥గోవింద॥

2. సాంబ సదాశివ శంభోశంకర
గౌరి మనోహర గణపతి సుఖకర
గంగాధర నటరాజ దిగంబర
పార్వతి రమణ ఫణివర కంకణ
గోవింద - శివ గోవింద - సచ్చిదానంద ॥ శివ ॥



3. రఘుపతి రాఘవ రఘుకుల తిలక
కోసలేంద్ర ప్రభు శ్రీరామచంద్ర
దశరథ నందన జానకి రమణ
పట్టాభిరామ కారుణ్యధామ
గోవింద -రామ గోవింద-కరుణానంద ॥ రామ ॥

4. పీతాంబరధర మదన మనోహర
మోర ముకుటధర మురళీలోల
ఇందిరా రమణ సుందర వదన
మునిజన వందిత పావన చరణ
గోవింద - కృష్ణ గోవింద -
పరమ ప్రేమానంద ॥ కృష్ణ ॥

5. బ్రహ్మానంద పరమానంద
సదానంద గురు పూర్ణానంద
రామానంద కృష్ణానంద
శివానంద చైతన్యానంద - గోవింద
గురు గోవింద - శరణానంద ॥ గురు ॥



# వందన మందుకో

## (చైతన్య గానం - 5)

## 39. గానలోల కరుణాలవాల

**పల్లవి :**

గానలోల! కరుణాల వాల!
గాచి బ్రోవు నిరుపమ గుణశీల! ॥ గాన ॥

**చరణములు :**

1. అగుపించ వేమి శ్రితజన పాల?
నరుల దృష్టి నిన్నేమి చేయు
దర్శనము దృశ్యము ద్రష్టవు కావా!
కాలము దూరము కల్పన కావా! ॥ గాన ॥

2. ఉపచారములు నేర్వని వారము
అపచారములే ఎరిగిన వారము
అర్హత లేవియు పొందని వారము
సారము లేని మేము నీ వారము ॥ గాన ॥



3. కన్నులలో వెలుగువు నీవే
వెన్నెలలో వెలుతురు నీవే
జలమున ప్రాణము జగతిలో జీవము
అంతా నీవే! అనంతము నీవే! ॥ గాన ॥

4. వినుమా గోల - శ్రీరమణీ లోల
మాయాజాలము నే తాళ జాల
నీలి నయనాల త్రిభువన పాల!
ఆశ్రిత మందార! చైతన్య శీల! ॥ గాన ॥



## 40. కరుణామయ దేవా

**పల్లవి :**

కరుణామయ దేవా!
జై జై గురుదేవా!

**అనుపల్లవి :**

అజ్ఞాన నాశక! సుజ్ఞాన పోషక!
సద్గురు మహాదేవా! ॥ కరుణా ॥

**చరణములు :**

1. తరువు ఒక్కటైనా పక్షులు పదివేలు
గురువు ఒక్కడైనా శిష్యులు వేలకు వేలు
భావికి దారిదీపాలు ॥ కరుణా ॥

2. దేశం కాలం మాయాజాలం సోకని నిరామయ!
అండ పిండ బ్రహ్మాండంబున
వెలసిన వేల్పువయా!
మా భ్రాంతిని బాపుమయా! ॥ కరుణా ॥



3. నేనే దైవము - మ్రొక్కు నీ వనుచు
పలికెదరు సురులు
నీవే బ్రహ్మము - నేనే నీ వని
పలుకును గురుకవులు
మాకు కామధేనువులు ॥ కరుణా ॥

4. జాతిధనాలు కులభేదాలు
తెలియని మహనీయా!
శాంతిప్రేమలు జ్ఞానజ్యోతులు
పంచే దయామయా!
చైతన్య హృదయనిలయా! ॥ కరుణా ॥



# 41. ఏరు పారింది

**పల్లవి :**

ఏరు పారింది - పైరు పెరిగింది
చేరువైన నా మది కుమిలింది ॥ ఏరు ॥

**అనుపల్లవి :**

ధన్యజీవుల పుణ్యపంటలు
తగని వారికి ఎండమావులు ॥ ఏరు ॥

**చరణములు :**

1. మూగ వెదురులో మురిపెముగా
రాగము నింపిన అనురాగము
గుండె నిండిన భక్తి పొంగినా
మారు పలకని వెన్నుని మౌనము ॥ ఏరు ॥

2. నలుపు మెరుపులో వలపు ఉందని
పిలుపు నిచ్చినవి యమునా జలములు
నలుపులైన మము నలుపు చుంటివి
నీ రంగు రహస్యము ఘనమైన తెలుపు ॥ ఏరు ॥



3. కొండంత వెలుగును విరజిమ్మినది
కోమలమైన నీ చరణ కమలము
కళల కాంతులతో విచ్చు కున్నది
పులకించిన నా హృదయ కమలము ॥ ఏరు ॥

4. ప్రేమ లతనై నను ప్రాకనీ - నీ
పద లయ గతినై ఆడనీ
నీ యెదలో శ్రుతినై పాడనీ
నీ మదిలో స్మృతిగా మిగలనీ ॥ ఏరు ॥





## 42. వందన మందుకో మారుతి

**పల్లవి :**

వందన మందుకో మారుతి
మది నీ కర్పణ జేసితి
నా మది నీ కర్పణ జేసితి ॥ వందన ॥

**చరణములు :**

1. నీకై ఎదురు చూచితి
నీ కొరకే దారులు కాచితి
మాకుల మాటున ఆకుల పంచన
నిన్నే నిన్నే వెదకితి ॥ వందన ॥

2. ఆరని రెప్పల చూపులతో
మారని ఆశల రూపులతో
పరచిన మబ్బుల పరుపులలో
నీ పాదముద్రకై వేచితి ॥ వందన ॥



3. ఆకులతో తమల పాకులతో
నిన్నే సింగారించితి
సాకులతో నా శ్వాసలు కదుపుతూ
పోవక నీకై నిలిచితి ॥ వందన ॥



# 43. అద్వైతామృత ఆనందప్రియ

**పల్లవి :**

అద్వైతామృత ఆనందప్రియ
అగణిత గుణగణ సుందరశివ
సుందరశివ - సుందరేశ శివ! ॥ అద్వైత ॥

**చరణములు :**

1. ఛిద్రమైన జీవితాలకు
భద్రనౌకవు రుద్రదేవా!
బరువు బ్రతుకుల బాధల నణచి
బోధలు పంచే భువనవంద్య ॥ అద్వైత ॥

2. తోడు నీడ నాకు లేదు
ఆశ ఒక్కటే నాకు తోడు
సుందరమైన నిన్ను వలచి
ఆశ కూడ నన్ను విడిచె ॥ అద్వైత ॥



3. పుట్టి చేసిన పుణ్య మేదో
పంచ చేరి కంచ మాయె
వల్లకాటి భాగ్య మేదో
నీకు తానే మంచ మాయె
బుద్ధులున్న నేరమునకా
నరుల బ్రతుకు వంచ నాయె ॥ అద్వైత ॥

4. తలచిన లూతకు శుభ గతి
పిలిచిన హస్తికి సుళు వది
వలచిన నాగును కనికరించి
కొలిచిన మాకు దూర మైతివా! ॥ అద్వైత ॥



# 44. కడలి అలల వోలె మనసాయె

**పల్లవి :**

కడలి అలల వోలె మనసాయే
అంబర మంతాయె నా హృదయం ॥ కడలి ॥

**చరణములు :**

1. కవుల ఊహలు పాపల నవ్వులు
హరివిల్లు రంగులు నను చేరే
కోకిల రవములు కుసుమ బాలలు
కదిలించే మదిని స్పృశియించే ॥ కడలి ॥

2. తారల వెలుగులు మబ్బుల మెరుపులు
ఉరుముల పలుకులు యెద నిండే
చల్లని వానలు తడిసిన ఒడలు
మెల్లగ నీ రాక వివరించే ॥ కడలి ॥



3. తలుపులు లేని నీ గుడిలో
నీ రాకను ఆపే వారెవరు?
తలపులు ఆగిన నా హృదిలో
తడబడతా వేమి రావేమి? ॥ కడలి ॥



## 45. భవభయ నాశిని

**పల్లవి :**

భవభయ నాశిని! దుష్ట నివారిణి
సంకట నాశిని! పాలయ మాం!
జై భవాని! పాలయ మాం!

**చరణములు :**

1. మణిమయ భూషిణి! జగదఘ మోచని!
పరిజన పాలని! పర్వత నందిని!
మాయ విదారిణి! మహేశ్వర తోషిణి!
ప్రణవ స్వరూపిణి! అంబ భవాని! ॥ భవ ॥





2. మానస దాయిని! మంజుల లోచని!
శివసతి భగవతి! పాలయ మాం!
త్రిజగన్మోహిని! త్రిశూలధారిణి!
శోకహారిణి! చైతన్యరూపిణి! ॥ భవ ॥



# 46. కశ్చిత్ అస్తి అపార శక్తిః

**పల్లవి :**

కశ్చిత్ అస్తి అపార శక్తిః అనంత శక్తిః
కశ్చిత్ ఆభాతి సచ్చిద్వ్యోమ్ని ॥ కశ్చిత్ ॥

**చరణములు :**

1. నిరుపమ నిరవద్య నిత్య నిరాభాసం
నిర్వికార నిరస్త ప్రపంచం
నిర్వికల్ప నిరంజన నిర్బీజం
నిరీహ నితాంత నిర్మల ఆత్మా! ॥ కశ్చిత్ ॥

2. సంతత మానంద మనుభవ రూపం
నిత్య ప్రబుద్ధ మరూప మనంతం
న కించి దస్తి తద్వ్యతిరిక్తం
సర్వం ఆత్మైవ తదేవ సర్వం ॥ కశ్చిత్ ॥



3. చిదాకార చిదానంద చిన్ముద్రం
చిద్విలాస చిదాకాశ చిద్రూపం
చిదమల చిద్ధ్రువ చిరంతన చిన్మయం
చరతి చిద్గగనే చైతన్యాత్మ! ॥ కశ్చిత్ ॥





## 47. మంగళం బిదే మాధవ మురారి

**పల్లవి :**

మంగళం బిదే మాధవ మురారి
కళ్యాణరూప! కరుణాస్వరూప! ॥ మంగళం ॥

**చరణములు :**

1. పెంచినావు భక్తి - పెద్ద మనసు చేసి
ఉంచినావు ఇలలో - నీ మహిమ వర్ణింప
॥ మంగళం ॥

2. వేడు చుంటినయ్య - తోడు వుండవయ్య!
పాడు చుంటినయ్య - కాపాడు చుండుమయ్య!
॥ మంగళం ॥

3. భావము కలబడి - భాష ఎగబడి
మనసు తెగబడి - చెల్లించెను మొక్కుబడి
రాధారమణ గోవిందా - గోవిందా!
ప్రహ్లాద వరద గోవిందా - గోవిందా!
అంబరీష వరద గోవిందా - గోవిందా!
॥ మంగళం ॥



4. కలకాలము కలసి ఉండు స్వామి
ఏగేటి వేళ ఎదురు నిలువు దేవ!
॥ మంగళం ॥

5. గోకులబాల! రాధాలోలా!
నతజన పరిపాల! చైతన్య నుత లీల!
॥ మంగళం ॥



# భలే భలే సృష్టి

## (చైతన్య గానం - 6)

### 48. మల్లెకన్నా తెల్లనైన మనసు

**పల్లవి :**

మల్లెకన్నా తెల్లనైన
మనసు నాకుందిరా
మనసు లేని స్వామీ
నా మనసు నేలరా! ॥ మల్లె ॥

**చరణములు :**

1. వెన్నపూస పెట్టి నిన్ను
దాచుకొందు నాలో
వట్టి బాస చేసి నన్ను
వదలి పోకురా! ॥ మల్లె ॥

2. దోర వయసు దోచుకున్న
దొంగ నీవు కావా
దొంగ మనసు దాచిపెట్టి
దొరలాగ రావా! ॥ మల్లె ॥



3. పాటలతో సాగిపోవు
బాటసారి నేను
దారి తప్పి పోతినా
నీ దరికి చేరలేను ॥ మల్లె ॥

4. ఎవరు లేక మిగిలియున్నా
నిన్నే నమ్ముకున్నా
నమ్మి చేసి పోకురా
బ్రతకలేను కన్నా! ॥ మల్లె ॥



## 49. భలే భలే సృష్టి

**పల్లవి :** భలే భలే సృష్టి
ఇది భలే మంచి సృష్టి ॥ భలే ॥

**అనుపల్లవి :**
ఎంత తెలిసినా అంతు తెలియని
భగవంతుని సృష్టి- మహా బలవంతుని సృష్టి ॥భలే॥

**చరణములు :**

1. ఏదైనా నమిలి తినేందుకు నోరు సిద్ధమై యున్నా
ఏది తినాలో తెలిపే టందుకు ముక్కు దానిపైన
ముందున్నాయి చూచే కళ్ళు
ముందు కున్నాయి నడిచే కాళ్ళు
ఏది ఎక్కడ ఎందు కున్నదో తెలిసి ఉంచుటే సృష్టి
॥ భలే ॥

2. కుర్చీలున్నా కూర్చునేందుకు కాళ్ళకు కీళ్ళుండాలి
ఎంతున్నా తినే చేతికి దండిగ వేళ్ళుండాలి
నమిలే టందుకు పళ్ళుండాలి
వాలే టందుకు నడు ముండాలి
ఏవేవి ఎలా ఉండాలో కలిపి ఉంచుటే సృష్టి
॥ భలే ॥



3. ఊహల నడుమ ఊయల లూగే
మనసు బయట పడుతుంది
గాలులాడినా ఆరని దీపం
అంతరంగమున ఉంది
అబ్బొబ్బొ! లబ్‌డబ్ గుండె -
అది ఆగితే బ్రతుకే ఎండె
ఎండే గుండెను పండించేందుకు
అండగ నాథుడు ఉండె ॥ భలే ॥

4. ఉండినదే ఊడి పడితే
సృష్టి ఎలా అవుతుంది?
లేనిది ఊరేగాలంటే ఎలా సాధ్య పడుతుంది?
ఉన్నది మళ్ళీ రానే రాదు
లేనిది ఎపుడు వచ్చే దుండదు
నామ రూపాల సృష్టి నామాలయ్యే పుష్టి
సహస్ర నామాలయ్యే పుష్టి ॥ భలే ॥

## 50. మతములు ఎన్నైనా

**పల్లవి :**

మతములు ఎన్నైనా
సమ్మతము నీదేలే
కులములు ఎన్నున్నా
అనుకూలము నీవేలే ॥ మతము ॥

**చరణములు :**

1. కరములు రెండైనా
కనికరము ఒకటేలే
కెరటము లెన్నైనా
కడలి ఒకటేలే ॥ మతము ॥

2. కన్నులు రెండైనా
కనుచూపు ఒకటేలే
పెదవులు రెండైనా
దరహాసము ఒకటేలే ॥ మతము ॥



3. చుక్కలు ఎన్నైనా
చందురుడు ఒకడేలే
తత్త్వము లెన్నున్నా
అద్వైతము ఒకటేలే ॥ మతము ॥

4. మాటలు ఎన్నున్నా
మనసు ఒకటేలే
మనుగడ లెన్నున్నా
మోక్షము ఒకటేలే ॥ మతము ॥



## 51. జల చర మృగ భూసుర నరరూపా

**పల్లవి :**

జలచర మృగ భూసుర నర రూపా!

గోపగోపికా జన పావనరూపా! ॥ జలచర ॥

**చరణములు :**

1. భక్షించితివి మన్నును - తప్పంటివి భ్రాతను
అర్థించితివి మాతను - తుడిచావు తలరాతను
వాడలు మేడలు ఆకాశ వనభూములు
జంగమ స్థావర సాగర పర్వత సురలోక తేజస్సులు
ఒదిగినవి నీ నోటిలో - దాగినవి నీ కుక్షిలో
కరుణించు కమలాక్ష! జననాథ జగదీశ్వర! ॥ జల॥

2. వికచ కమల నేత్ర! సుందర సుమగాత్ర
దేవకి ప్రియపుత్ర! సమస్త లోకసూత్ర!
నిఖిలపావన, నిర్మలజీవన, సర్వేశ, సురవందిత
విశ్వకారణ, పన్నగశయన, క్షీరాబ్ధి నిద్రిత!
నీలి గగన మండల సుందర!
మంజుల మురళి మనోహర!
వేదాంత విజ్ఞాన స్వరూప సర్వేశ్వర! ॥ జలచర ॥



3. గోవర్ధనోద్ధారక! గోపీజన పాలక!
గోకుల సంపోషకా! గోధన సంరక్షకా!
ఉరుముల మెరుపుల జడివానలతో
బాధించెను సురపతి
పుట్టగొడుగు వలె గోవర్ధనమును
పై కెత్తితివి శ్రీపతి
గాలికి పోయెను గర్వములు
దిక్కై నిలిచెను చరణములు
నీ కరము సోకిన ఆ కొండదే భాగ్యము ॥ జల ॥



## 52. జాగేల రాజీవ నయనా

**పల్లవి :**

జాగేల రాజీవ నయన
నిను బాసి క్షణమైన
మనగలనా కరుణాభరణా ॥ జాగేల ॥

**అనుపల్లవి :**

నీ భక్తుడై యుండి నీ సేవ నాకుండి
అండీ! అండీ! అని పరుల వెంట పరుగిడ గలనా
॥ జాగేల ॥

**చరణములు :**

1. అడిగి పుచ్చుకొని అటుకుల దింటివి
అడగక అక్షయ సంపద లిస్తివి
అడగవు నన్ను అడుగ నీయవు
అచ్యుతానంత! ఏమిటిదంతా? ॥ జాగేల ॥



2. ఇది నాదంటూ, అది కాదంటూ
పలికి పలికి మది పగిలింది
ఏదీ ఎవరిది కాదని తెలిసి
ఎద నీ వైపుకు మరలింది ॥ జాగేల ॥

3. తొలి ప్రొద్దులో కదిలెను భక్తి
నడుమ ఎందుకో తరిగెను శక్తి
ఉన్నది నీవే మనసులోన
నిన్నే నమ్మిన వాడను కానా ॥ జాగేల ॥



## 53. జీవిత మింతేనా?

**పల్లవి :**

జీవిత మింతేనా!
సుఖదుఃఖాల సమరాంగణ మేనా ॥ జీవిత ॥

**అనుపల్లవి :**

మూడు దినాల ముచ్చట యేనా!
రేపో మాపో చీకటియేనా ॥ జీవిత ॥

**చరణములు :**

1. ఆశలన్నీ అలలేనా - ఆనందాలన్నీ కలలేనా?
కళకళ లాడుచు కదిలే ప్రేమలు
జీవిని బంధించు వలలేనా? ॥ జీవిత ॥

2. మనసులు కదిపి మమతలు చూపి
మంటలు రేపే గతియేనా?
మంచిని కుదిపి వంచన చేసి
బూదిగ మిగిలే చితియేనా? ॥ జీవిత ॥



3. పొరపాటులు ఎడబాటులు
ఎదబాధలు విధియేనా?
అశ్రులు నిండిన అనుభవ ధనమే
మనిషికి మిగిలిన నిధియేనా? ॥ జీవిత ॥

4. అభిమానాలతో అవమానాలతో
శతమానం భవతి
అలజడి నిండిన ఆవేదనలతో
శోకమయం జగతి
నీకేదైనా నీవేమైనా వీడదు ధర్మం నిరతి
నిండే ఎండే జగతి చెరువులో తీరని దప్పికే రీతి
జ్ఞానము పంచే చైతన్యగీతి ॥ జీవిత ॥





## 54. అందాల మూట

**పల్లవి :**

అందాల మూట - మా నోముల పంట
మా బ్రతుకంతా తానొక వింత ॥ అందాల ॥

**చరణములు :**

1. కంసుడు పంపగ ఏతెంచినది
బాలఘాతిని రక్కసి పూతన
మాయమాటలతో యశోదమ్మకు
విన్నవించినది నివేదన
మోస మెరుగని తల్లులిద్దరు
అంగీకరించారు మాయా ప్రార్థన
పాపి పూతన గోపాలు నెత్తుకొని
సాధింప సాగింది తన వంచన
విషచిత్తమును ఎరిగిన విభుడు
విషగళ సఖుడు గోవిందుడు
చనుబాలు త్రాగుచు పని పూర్తిచేసె
పనితన మెరిగిన ఆ బాలుడు ॥ అం ॥

2. కాళియ మడుగున విషకలిత తోయమ్ము
త్రాగి మూర్ఛిల్లిరి గోవులు గోపులు
అసువులు బాసిన వారిని కూడ
బ్రతికించినవి గోపాలుని చూపులు
కాళింది జలమును పావనము చేయ
నడుము బిగించాడు నందనందనుడు
గరుడుని వోలె కాళీయుని పట్టి
పీడించ సాగాడు సుకుమార బాలుడు
కాళియనాథుడు గోకులనాథుని
పదములు తలపై ధరించెను
ఆ వింతను గని అచ్చెరు వొందిన
సర్వలోకములు తరించెను ॥అందాల॥

3. వేదనాదమె వేణుగానమై
గోకుల వాడలో వినిపించింది
సుందరాకృతిని ఆనందముగ గని
రేపల్లె పురము క్రీడించింది
దివి పువ్వులు వర్షించు చుండగ
రాసమండలం ప్రభవించింది
చరణస్పర్శతో పరవశించిన
ధరణీమాత తరించి పోయినది
వనజలోచనుడు బృందావనమున
వాసుదేవుడై విహరించెను
ఆ మూర్తిని గని తృప్తిని పొంది
సర్వ జగంబులు సుఖించెను ॥అందాల॥

## 55. ఏ కర్మమునకు ఏది ఫలమో

**పల్లవి :**

ఏ కర్మమునకు ఏది ఫలమో
ఎరిగిన వారెవరు?

**అనుపల్లవి :**

చేసిన కర్మము ఫలమును పొందక
దాటే వారెవరు? ॥ ఏ కర్మము ॥

**చరణములు :**

1. ఊగే చెట్లను ఊపే గాలులు
కంటికి కనబడవు
జీవుల నడిపే కర్మ ఫలాలు
మనసుకు వినపడవు
ఏ క్షణానికి ఏదేమౌనో ఎవరూ ఎరుగరు
నాటక మెంత కాలము సాగినా
తెర పడుట క్షణము ॥ ఏ కర్మము ॥



2. నీది కానిది నీకు లేనిది రమ్మన్నా రాదు
నీది అయినది నీకొర కున్నది పొమ్మన్నా పోదు
ఉండే వాటిని పొమ్మనకు మరి లేనిది రమ్మనకు
రాకపోకల వాడుక తెలియక వేడుక లేదనకు
॥ ఏ కర్మము ॥

3. అనుకూలములు ప్రతికూలములు
ఫలములలో లేవు
అధికమైనా అల్పమైనా ఫలము నిష్ఫలము
రాగము కాని ద్వేషము లేని
ఫలములు బాధించవు
ఏది వచ్చినా ఎలా వచ్చినా నీ కది ప్రసాదము
॥ ఏ కర్మము ॥





## 56. ఎన్నాళ్ళున్నా ఈ జీవితము

**పల్లవి :**

ఎన్నాళ్ళున్నా ఈ జీవితము మూన్నాళ్ళే గదరా
మనుషులు మమతలు ఆటబొమ్మలు
క్షణ కాలమె గదరా ॥ ఎన్నాళ్ళున్నా ॥

**చరణములు :**

1. సారహీనమౌ సంసారంబున
ఎండమావులు సంపదలు
కృష్ణ చరణములు చక్కగ నమ్మి
తరియించగ లేవా ॥ ఎన్నాళ్ళున్నా ॥

2. ఎవరికి ఎవరో ఎవరూ ఎరుగని
శోకమయము ఈ లోకము
ఏది పొందినా ఎవరు ఉండినా
సుఖములు ఉండవులే ॥ ఎన్నాళ్ళున్నా ॥



3. కాలి పోవుటకు కదలి వచ్చిన
కట్టెలే కాయములు
కనుల ముందే కరిగి పోవు
కాయ కర్పూరములు ॥ ఎన్నాళ్ళున్నా ॥

4. మెరుపు లాంటి యవ్వనంబున
చెడులే స్నేహితులు
కాల హరణము మరణ రూపము
జ్ఞానమె శరణ్యము ॥ ఎన్నాళ్ళున్నా ॥





# వెలుగుల తోరణం

## ( చైతన్య గానం - 7 )

## 57. సుర నర ముని జన జనని భవాని

**పల్లవి :**

సుర నర ముని జన జనని భవాని
చిర సుఖదాయిని శుభకారిణి ॥ సురనర ॥

**అనుపల్లవి :**

జగత్కారిణీ జగత్తారిణీ
జయ జయహే భవతారిణి కారిణి ॥ సురనర ॥

**చరణములు :**

1. ఆనంద దాయిని కారుణ్యరూపిణి
త్రిభువన తారిణి త్రినయని
దుఃఖ నివారిణి ముక్తి ప్రదాయిని
అనేక కోటి బ్రహ్మాండ జనని ॥ సురనర ॥



2. కావ్య వినోదిని కామరూపిణి
కుమార జననీ కామాక్షీ!
కాలహంత్రీ కాత్యాయనీ
కామేశ్వర ప్రాణేశ్వరి ఈశ్వరి ॥ సురనర ॥

3. పంకజలోచని పాపనాశిని
ప్రాణరూపిణి పార్వతి
గాయత్రీ గురుమండల రూపిణి
జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ స్వరూపిణి ॥ సురనర ॥



## 58. రాధిక, కృష్ణా! రాధిక

**పల్లవి :**

రాధిక, కృష్ణా! రాధిక
నీ చెంతకు రాదిక
నీ చెలిమికి రాలేదిక ॥ రాధికా ॥

**అనుపల్లవి :**

కాలమేమో ఆగదు
కరుణ నీలో కదలదు ॥ రాధికా ॥

**చరణములు :**

1. వేణువు నీతో ఉండనీ
పింఛము నీపై కదలనీ
రాధ ఏదని అడగనీ
రాదనే బాధ మిగలనీ ॥ రాధికా ॥

2. యమున యెదతో పారనీ
నను నీ మదిలో పారిపోనీ
కన్నీరంతా కారిపోనీ
యమున లోనే చేరిపోనీ ॥ రాధికా ॥



3. వేడుకగా నీ చేతిలో
వెదురు మురళి ఊరేగనీ
వేదనతో ఈ భామిని
ఎదురు రాదని మురియనీ ॥ రాధికా ॥

4. చూపులు లేవు కంటికి
మాటలు రావు నోటికి
కాంతులు ఉండవు కొందరికి
మనసులు మూగవి అందరికి ॥ రాధికా ॥



## 59. వెలుగుల తోరణం ప్రతి ఉదయం

**పల్లవి :**

వెలుగుల తోరణం ప్రతి ఉదయం
వెతలకు నిలయం ప్రతి హృదయం ॥ వెలుగు ॥

**అనుపల్లవి :**

నడి సంద్రములో మునిగే నావలు
కడతేర లేని కన్నీటి జీవులు ॥ వెలుగు ॥

**చరణములు :**

1. కలిమిలో ఏముందో లేమిలో ఏదుందో
కలిమి లేముల బ్రతుకు కలతల చెరువు
ఎంతకు తీరదు జీవికి కరువు
తెలిసి బ్రతుకుటే జీవన తెరువు ॥ వెలుగు ॥

2. మురిపించేవి తీపి మమతలు
ఉరితీసేవి చేదు కలతలు
మమతలు కలతలు ఎండమావులు
గుండెలో తిరిగే సుడిగుండాలు ॥ వెలుగు ॥



3. వెలుగుతున్నది దీపకాంతి
ఆరే లోగా పొందాలి శాంతి
పనికిరావు పొరలిన పాలు
చివరికి బ్రతుకులు మట్టి పాలు ॥ వెలుగు ॥

4. పోయేది ఎవరో వచ్చేది ఎపుడో
రాకపోకలకు రూపే లేదు
ఉన్న దొక్కడేనని వీడని తోడని
తెలిసి బ్రతికితే బాధే లేదు ॥ వెలుగు ॥



## ౬౦. కదలి రారా! కృష్ణా! వదలి రారా!

**పల్లవి :**

కదలి రారా! కృష్ణా! వదలి రారా!
ఏ మాయ లెరుగని యమునా తటికి ॥ కదలి ॥

**చరణములు :**

1. కలిముంది బలముంది జ్ఞానముంది గానముంది
అభియోగాల అరచేతి రాతుంది
అందరికి ఆనందం పంచాలని పోయి
దగా పడినావు దొంగ వని తేలావు ॥ కదలి ॥

2. మనసిచ్చి మాటిచ్చి రాయబారము చేయ
కసితీర కౌరవులు కత్తి గట్టినారు
ప్రతిన బూని పాండవుల రక్షించినావు
బావా! బావా! యని బండి తోల మన్నారు
॥ కదలి ॥



3. కండలేని దేహంతో కదలి వచ్చిన బాపడు
అలనాటి కల్లబొల్లి కథలు వల్లించి
హరి హరి యంటూ సిరిపై మనసుంచి
హరియించినాడు చెలిమితో కలిమిని ॥కదలి ॥

4. బాధను బాపుటకు లేదా రాధ ?
రాగము నింపుటకు మురళి కాదు పేద
యాతన లేనిది యమునా తీరం
మమతకు కలతకు ఎంతో దూరం ॥ కదలి ॥



## 61. నా కవితే కోవెల

**పల్లవి :**

నా కవితే కోవెల
నా పూజకు తరలిరా ॥ నా కవితే ॥

**అనుపల్లవి :**

వచ్చే దారిని తెలిపితే
నా యెదను అడుగుకు పరిచెద ॥ నా కవితే ॥

**చరణములు :**

1. ఆశే కోవెల దీపము - నీ
రూపే దానికి ప్రాణము
చూపే వరకు మారదు
నిను చూడక అది ఆరదు ॥ నా కవితే ॥

2. మధుర మధుర భావనలే
నీ సేవలో పూవులు
నా గుండెలో గుసగుసలు
వినిపించును గుడి గంటలు ॥ నా కవితే ॥



3. అణు వణువున కోవెల తలుపే
అనుక్షణము నీ వలపే
నీ మీదే నా రాగము
నీ మాటకే నా తాళము ॥ నా కవితే ॥

4. మూతబడదు గుడి తలుపు
అది నా కంటి చూపు
గుడిలో నీ రూపు కరువైతే
మిగిలే దిక కనుమూతే ॥ నా కవితే ॥



## 62. అనాథులే - అనాథులే

**పల్లవి :**

అనాథులే - అనాథులే
అనాథులే - ఎవ్వరైనా ॥ అనాథులే ॥

**అనుపల్లవి :**

ఉన్నవారైనా అనాథులే నని
ఉన్న మాటను చాటించిన వేల్పులు ॥ అనాథులే ॥

**చరణములు :**

1.లాలపోసి పాపట తీసే తల్లి కరువైన శివ పాపడు
బూది రాసుకొని జడలు చుట్టుకొని
దిక్కు తెలియని దిగంబర శివుడు - అనాథుడే
॥ అనాథులే ॥

2. ఆకులు అలములు దుంపలు జలములు
తీర్చెను ఆకలి అనాథునికి
పండు ముసలి దాచిన ఫలములు
ప్రాణము లాయెను ఆ నాథునికి
॥ అనాథులే ॥



3. విదురుని యింట పండ్ల తొక్కలే
విందాయెను అనాథునికి
పేద బాపడు దాచిన అటుకులు
దిక్కాయెను దీననాథునికి ॥ అనాథులే ॥

4. నాథుడుంటే చాకిరి తప్పదు
అనాథుల కెవరు నాథులు?
తానే నాథుడు అనాథునకు
అకార రూపుడు అచ్యుతుడు
శివుడే తానని తెలిసిన జీవుడు - అనాథుడే
॥ అనాథులే ॥





## 63. ఎన్నో ఎన్నో రూపాలు

**పల్లవి :**

ఎన్నో ఎన్నో రూపాలు
అన్నీ ఆరే దీపాలు

**అనుపల్లవి :**

మారని రూపం - ఆరని దీపం
భువిలో దివిలో నీవే సకలం ॥ ఎన్నో ॥

**చరణములు :**

1. ఏదీ గాని ఎవరూ లేని
ఏకాంతమే నీ రూపము
కనరాదు ఎవరికైనా
ఎరుగరాని స్వరూపము ॥ ఎన్నో ॥

2. ముంత మూకుడు బానలు కుండలు
నామ రూపాల పోకడలే
మట్టి పాత్రలకు మన్నే అండ
జగ మంతటికి నీవే నిండా ॥ ఎన్నో ॥



3. దూరము గాని దేశములో
సమయము రాని కాలములో
రూపాలన్నీ ఒకటే దౌడు
అందరికీ నీవే తోడు ॥ ఎన్నో ॥

4. రూపాలకు రూపము నీవే
రూపము లేని స్వరూపము నీవే
ఊరు పేరు ఉనికి ఏల?
ఊపిరి నీవై నిలిచిన వేళ ॥ ఎన్నో ॥



## 64. గాలి మేడలు

**పల్లవి :**

గాలి మేడలు - నీటి ఓడలు
మట్టి గోడలు - మనిషి జాడలు ॥ గాలి ॥

**అనుపల్లవి :**

నీడలు - తోడు నీడలు
నీడివ్వని నీలి నీడలు ॥ గాలి ॥

**చరణములు :**

1. సిరులు కలిగినా సంపద పెరిగినా
నేలకూలే మేడలు - గాలి మేడలు
మనుషులున్నా మమతలున్నా
నీట మునిగే ఓడలు - తోడు నీడలు
పెంచుకున్నా ఉంచుకోలేని గోడలు - వలపు గోడలు
తోడు నడచినా అంతు చిక్కని జాడలు
నిజము కాని నీడలు ॥ గాలి ॥



2. ఎండ వేళలో చెట్టు నీడన
పిల్లలు ఆడేవి క్రీడలు - బాలక్రీడలు
కాలే వనము కూలే భవనము
పెద్దలు ఆడేవి ఆటలు - బ్రతుకు ఆటలు
రగిలే గుండెలు కురిసే నిప్పులు
విధి చేతిలో బంతులు - కాలి బంతులు
ఎటు పోయినా, ఎలా పోయినా
అనుసరించేవి నీడలు - మృత్యునీడలు ॥ గాలి ॥

3. కరిగే కలలో కదిలే కళలు
కళ్ళు తెరిచితే కల్లలు - చెల్లురాతలు
జీవి బ్రతుకులో చదరంగాలు
ఛాయ లుడిగితే మాయలు - మటు మాయలు
మంచు కరిగితే మనసు మరిగితే
కనిపించేవి మహిమలు - దైవ మహిమలు
బుద్ధి పండితే బ్రతుకు నిండితే
భాసించేది బ్రహ్మము - పరబ్రహ్మము ॥ గాలి ॥



## 65. కావాలి - రావాలి - దీపావళి

**పల్లవి :**

కావాలి - రావాలి - దీపావళి
చీకటి ముసిరిన బ్రతుకుల
తిమిరాలను తరుముటకు ॥ కావాలి ॥

**చరణములు :**

1. మనసున తాపాలు - మహిలో కలహాలు
మనుషుల నడుమ - మారణ హోమాలు
మారాలని, పోవాలని సందేశ మిచ్చేదే ॥ కావాలి ॥

2. నరక దానవుడు - దాగెను లోలోన
వేదన తిమిరాలు - పరిచెను మన లోన
చీకట్లను పారద్రోలు శ్రీకృష్ణజ్యోతి ॥ కావాలి ॥



3. ధరణిలో వెలగాలి - సమతాజ్యోతి
మనసున నిలవాలి - మంగళహారతి
ప్రేమను గుండెలలో నిలిపే దీపం ॥ కావాలి ॥

4. మాయలు మాటలు - మహిమలు కాలేవు
స్వరూప బోధయే - కామధేనువు
భువినంతా దివి చేసే ఆర్షధర్మ జ్యోతి ॥కావాలి॥



# సర్వదేవ నమస్కారం

## (చైతన్య గానం - 8)

## 66. గణేశం గజవదనం

**పల్లవి :**

గణేశం గజవదనం!
గుణాతీతం వందేఽహం! ॥ గణేశం

**అనుపల్లవి :**

ప్రభవః ప్రలయః స్థితి హేతుం!
అపార మానన్ద మనంత మూర్తిం! ॥ గణేశం

**చరణములు :**

1. నిరుపమ గుణగణ మంగల దాతా!
బుద్ధి ప్రదాతా సిద్ధి వినాయకం! ॥ గణేశం



2. సుందర సదన మనోహర వదన!
సురవందన శైలజ ప్రియనందన ! ॥ గణేశం ॥

3. అంబాకుమార లంబోదర హరప్రియ!
మోహసంహార మహిమా విహార! ॥ గణేశం ॥



## 67. మృత్యుంజయ శివ శూలపాణే

**పల్లవి :**

మృత్యుంజయ శివ శూలపాణే
శశిఖండ మండన!
మృత్యు సంసార ఖండన! ॥ మృత్యుంజయ ॥

**అనుపల్లవి :**

యజ్ఞాయ యజ్ఞాది ఫలప్రదాయ!
వందే పార్వతీ పతయే మృడాయ !
॥ మృత్యుంజయ ॥

**చరణములు :**

1. నిర్గుణాయ నిష్కలాయ!
నిరాకార స్వరూపాయ!
నిర్మలాయ నిర్మదాయ నిరామయాయ!
నిర్భయాయ నిరాగాయ నిష్కలంక వైభవాయ!
నిస్సంగాయ నిస్తులాయ తుభ్యం నమః !
॥ మృత్యుంజయ ॥



2. సర్వమంత్ర స్వరూపాయ!
సర్వతంత్ర నియంతాయ!
సోమ సూర్య లోచనాయ సకల లోక రక్షకాయ!
పరమ శాంత స్వరూపాయ పార్వతీ మనోహరాయ!
రుద్ర భద్ర మహా రౌద్ర పాతుమాం సదా!
॥ మృత్యుంజయ ॥

3.సకల వేద పారగాయ! వేదాంతసారాయ!
భోగ రాగ విదూరాయ సర్వరోగ వినాశాయ!
సురవర ముని పూజితాయ శరణాగత వత్సలాయ!
శర్వాయ సర్వాయ నమశ్శివాయ!
॥ మృత్యుంజయ ॥



# 68. సురముని రంజన సుందరరామ

**పల్లవి :**

సురముని రంజన సుందరరామ!
పాప విమోచన పావననామ ! ॥ సురముని ॥

**చరణములు :**

1. సజ్జనరక్షక శ్రీలోల!
సౌఖ్య ప్రదాయక సారశీల!
శబరీ ఫలాశ సీతాలోల!
అహల్య వరద అద్భుతలీల! ॥ సురముని ॥

2. ధరణీభరణ జానకిరమణ!
ధర్మస్వరూపా జయజయరామ!
పాపవిదారణ సత్యపరాయణ!
తత్త్వవిచారణ తారకరామా! ॥ సురముని ॥



3.నయనాభిరామం శ్రవణాభిరామం!
భజామి నిత్యం రామాభిరామం!
నమోస్తుతే శ్యామల కోమలాంగం!
శ్రుతిసార రూపం మనసా స్మరామి!॥ సురముని ॥





## 69. కేశవ! కరుణాకర!

**పల్లవి :**

కేశవ! కరుణాకర!
మాధవా! మనోహర! ॥ కేశవా ॥

**అనుపల్లవి :**

పాతు మాం పరమానంద!
మాముద్ధర గోవింద ! ॥ కేశవా ॥

**చరణములు :**

1. అచ్యుతా త్వమేవ మాతా
అనంతా మోక్షప్రదాతా!
వందే బృందావన చరం
గోపీ జనవల్లభం! ॥ కేశవా ॥



2. రక్ష రక్ష హరే మాం
నిమగ్నం భవసాగరే!
రాధా సేవిత పాదాబ్జం
భావయామి దివానిశమ్! ॥ కేశవా ॥

3. సర్వాధారా నిరాధారా
పరమాత్మా పరాత్పరా!
పూర్ణరూప సుగుణాకర
ప్రసీద పరమేశ్వర! ॥ కేశవా ॥



## 70. చిన్మయీ - చిన్మయీ

**పల్లవి :**

చిన్మయీ - చిన్మయీ - చిన్మయీ
సుధామయీ - సుఖమయీ - సర్వమయీ
॥ చిన్మయీ ॥

**అనుపల్లవి :**

వీణా పుస్తక ధారిణీం
నిర్మదా - సునాదా - శారదా ॥ చిన్మయీ ॥

**చరణములు :**

1. శ్రుతిసార రూపిణి వీణాపాణి!
నిగమాగమ సంచారిణీ!
దేవి సరస్వతి సాగరవాసిని!
జ్ఞానదా - శాంతిదా - విశారదా! ॥ చిన్మయీ ॥



2. అవ్యాజ కరుణా వాహిని!
అనాది నిధనా ఆనందినీ!
అరవిందాసన సుందరీ!
ప్రాణదా - ప్రేమదా - ప్రసిద్ధా! ॥ చిన్మయీ ॥

3. వాగ్వాదినీ నాదరూపిణి!
ఆత్మజ్ఞాన ప్రదాయినీ!
వాగధీశ్వరి కమలపాణి!
సుఖదా! శుభదా! విజ్ఞానదా! ॥ చిన్మయీ ॥



## 71. హే రసనే! రస సారజ్ఞే!

**పల్లవి :**

హే రసనే! రస సారజ్ఞే!
సర్వదా సదా మధురప్రియే ॥ హే రసనే ॥

**అనుపల్లవి :**

హరి నామ స్మరణా దన్యోపాయం
న హి పశ్యామో భవతరణే ॥ హే రసనే ॥

**చరణములు :**

1. నారాయణం గోవిందం
పిబ రసనే నిరంతరం!
సర్వ సుఖదం శాంతికరం
తాపత్రయ కులాపహం! ॥ హే రసనే ॥

2. దామోదరం దమోపేతం
భూధరం భువనేశ్వరం!
నామ పీయూషా సమం తీర్థం
నాస్తి నాస్తి మహీతలే! ॥ హే రసనే ॥



3. విష్ణుం కేశవం కేశిహరం
అచ్యుతం అజం ఆదిదేవం!
నారాయణాఖ్యం పీయూషం
హన్తి విషం భవరూపమ్! ॥ హే రసనే ॥





# 72. పాహిమాం శ్రీదేవి!

**పల్లవి :**

పాహిమాం శ్రీదేవీ! శుభరూపే!
ఉద్ధర మాం! పతితం భవకూపే!
॥ పాహిమాం ॥

**చరణములు :**

1. నమస్తే నారద వినుతే
విష్ణోశ్చ ప్రియవల్లభే!
పాతు మాం నిత్యం శ్రీ జననీ
పద్మినీ భాగ్యదాయినీ! ॥ పాహిమాం ॥

2. నమామి శిరసా మనసా దేవీం
శరణాగత భక్తపోషిణీం!
శుభే మోక్షప్రదే దేవీ
శ్రీసతి హరివల్లభే! ॥ పాహిమాం ॥



3. లోక పావనీ కమలాక్షీ
భక్తి ముక్తి ప్రదాయినీ!
త్వయా వినా జగత్సర్వం
సారహీనం చ నిష్ఫలమ్! ॥ పాహిమాం ॥





## 73. చింతయామి శ్రీ హనుమంతం

**పల్లవి :**

చింతయామి శ్రీ హనుమంతం!
సంతం శాంతం రామదూతం! ॥ చింత ॥

**అనుపల్లవి :**

పవన తనయ! పావన చరిత!
మణిమయ భూషిత జన మునిపూజిత!
॥ చింత ॥

**చరణములు :**

1. జనక తనయ శోకనాశక!
ప్రియ లక్ష్మణ ప్రాణదాయక!
దనుజ నాశక! సుజన పోషక!
సృష్టి స్థితి సంహార కారకా! ॥ చింత ॥



2. మర్కటరాజా! మంగళరూపా!
చండ మహాభుజ పండిత రూపా!
భక్తవరద! పరమసుఖద!
నాన్య మహం జానే న జానే! ॥ చింత ॥

3. అక్ష విదారణ అంజనీ నందన!
సకల అమంగల మూల నికందన!
అనంతానంద కరుణాభరణ!
మాం పునాతు సుందర వదన! ॥ చింత ॥



## 74. భావనగమ్యా భవనాశినీ!

**పల్లవి :**

భావనగమ్యా భవనాశినీ!
బిందు మండల వాసినీ!
కాంక్షే సేవాం కల్యాణీం!
శ్రీభవానీం భావయామి! ॥ భావన ॥

**చరణములు :**

1.నమామి శిరసా త్రిపురాంబికే!
శర్వాణీ శశి బింబముఖే!
జగత్తారిణీ జగదంబే!
సదా నతోఽస్మి తవ పాదకమలమ్! ॥ భావన ॥

2. వందే దేవీ దుర్గే శరణ్యే!
సర్వమంగళ రూపిణీ!
హరి సహోదరీ వేదజననీ!
భక్త్యా నతోఽస్మి శివరంజనీ! ॥ భావన ॥



3.జయజయ జననీ ప్రేమరూపిణీ!
విశ్వధారిణి నాద స్వరూపిణి!
మలయాచల నివాసిని జననీ!
వినతోఽస్మి నిత్యం లీలా వినోదినీ! ॥ భావన ॥



## 75. శివ సుతం షణ్ముఖం

**పల్లవి :**

శివ సుతం షణ్ముఖం!
భజామి నిత్యం గురువరమ్! ॥ శివ ॥

**అనుపల్లవి :**

ప్రణమ్య శిరసా ఉమాసుతం!
భక్తావాసం అభయప్రదం! ॥ శివ ॥

**చరణములు :**

1. సాకారాయ నమస్తుభ్యం!
నిరాకారాయ తే నమః!
త్వదీయ కరుణా కిరణేన!
భక్తాః శాంతి మాగతాః! ॥ శివ ॥

2. శ్రీ స్కందం శిఖి వాహనం!
సేనానీ దేవసేనాపతిం!
శరవణ భవ శ్రీ సుబ్రహ్మణ్యం!
గురుం సురేశం శూలధరం! ॥ శివ ॥



3. గణపతి సహజం శక్తిపాణిం!
మదనారిపు సుతం కార్తికేయం!
మునిజన హృదయానంద దం - గుహం!
పార్వతీ ప్రీతి పుత్రం నమామి! ॥ శివ ॥





# పాడవే తుమ్మెద

## (చైతన్య గానం - 9)

## 76. పాడవే తుమ్మెద

**పల్లవి :**

పాడవే తుమ్మెద! కృష్ణుని మీద!
ఆడవే పాడవే హాయిగా తీయగా ॥ పాడవే ॥

**అనుపల్లవి :**

ఆడే రెక్కలు సాగవు ఓనాడు
పాడే గొంతుక పెగలదు ఆనాడు ॥ పాడవే ॥

**చరణములు :**

1. జగతి కొలనులో వెలుగు చున్నది
కమల లోచనుని చరణ కమలము
ఆడవే పాడవే అందాల తుమ్మెద
సుధలు గ్రోలి నిండును నీ యెద ॥ పాడవే ॥



2. తీయని నీ ఆశలు తీరే క్షణాన
విడదీయని మన స్నేహము మరువకే తుమ్మెద
నాథుని చేరిన ఆనందములో
శ్రీనాథుని చేరిన ఆనందములో
అనాథుని నన్ను మరువకే తుమ్మెద ॥ పాడవే ॥

3. ప్రేమ వనములో నీ పుణ్యాల పంటగ
రాసవిభునితో కులికే వేళ
నీ యెదపొంగుల చినుకైనా
ఈ పేద యెదపై పడనీ తుమ్మెద ॥ పాడవే ॥



# 77. నీవు లేక నేను లేను

**పల్లవి :**

నీవు లేక నేను లేను - లేను
నిన్ను విడిచి నేను ఉండలేను ॥ నీవు లేక ॥

**చరణములు :**

1. తీర్చినావు జీవులను గాలిపాలు పోసి
ఆడించినావు మాట పాట నేర్పి
తెరపడే వేళ అదేల?
ఉంచవు వేసిన రంగయినా ॥ నీవు లేక ॥

2. ప్రాణాలు పోయినా బ్రతుకు లుంటాయి
బ్రతుకులకు బ్రతుకులే అతుకు లవుతాయి
ఎన్ని జన్మలైనా
వెతకెదను నిన్నే మదిలోన ॥ నీవు లేక ॥



3. కట్టినాను అందమైన పొదరిల్లు నా యెదలో
సిగ్గులతో ముగ్గు లెట్టి నిగ్గు దీర్చినాను
కాపురము లేకున్నా
క్షణకాల ముంటే చాలు ॥ నీవు లేక ॥

4. బ్రతుకు బండలైనా బుద్ధి పండి ఉంది
మాధవ మాధవ యనుచు
మథన పడుతూ ఉంది
కొన ఊపిరైనా
తూలుతూ నీ పాదము చేరు ॥ నీవు లేక ॥



## 78. వెన్నెల నవ్వుల గోపాలా!

**పల్లవి :**

వెన్నెల నవ్వుల గోపాలా!
వెన్నలు తినను రావేల! ॥ వెన్నెల ॥

**అనుపల్లవి :**

పువ్వుల సొగసు గాలికి తెలుసు
విరిసిన నా మనసు నీకే తెలుసు ॥ వెన్నెల ॥

**చరణములు :**

1. మంచిమంచి మాటల మల్లె లున్నాయి
తియ్యని పాటల తేనె లున్నాయి
ఆరగించ రావేల అందాల బాల
ఆనంద మందించి ఉండిపో వేల ॥ వెన్నెల ॥

2. మాకుల మాటున మాపటి వేళ
నల్లని నీడలు పాకుతూ ఉంటే
నల్లనయ్య యని పరుగిడు వేళ
ఆకసమున మెరుపులు ఏల? ॥ వెన్నెల ॥



3. భక్తితో నిన్ను పిలిచేనా!
రాధనై నిన్ను వలచేనా!
కన్నయ్య నవ్వుల వెన్నెల లోన
పరవశించిన కలువ నౌదునా ॥ వెన్నెల ॥

4. అభమూ శుభమూ తెలియని నేను
అభయము కోరి నిను చేరినాను
నీకు లేదులే కన్నతల్లి
ఉన్నది నీవే మము గన్న తండ్రి! ॥ వెన్నెల ॥



## 79. గాలి విసురుతో

**పల్లవి :**

గాలి విసురుతో కూలేది తరువు
గాలి జాలి లేక రాలేది తనువు ॥ గాలి ॥

**అనుపల్లవి :**

వచ్చే గాలి తరువుకు చేటు
పోయే గాలి తనువుకు వేటు ॥ గాలి ॥

**చరణములు :**

1. గాలితో జతగూడి ఆడింది తరువు
శ్రుతి చేసి గాలితో కదిలింది తనువు
అసువుల నిచ్చి ఆడించిన వాయువు
కఠినముగా గొనిపోవును ఆయువు ॥ గాలి ॥

2. తరువైనా, తనువైనా గాలితోనే జీవము
గాలి దూరమైతే అంతా నిర్జీవము
పచ్చని తరువు ఎండుట తథ్యము
వెచ్చని తనువు మండుట సత్యము ॥ గాలి ॥



3. తరువుకు తనువుకు ఏమి బంధమో
తరువే తనువును కాల్చే వైనము
గాలి మగనికి ఇరువురు మగువలు
వల్లకాటిలో ఒకటై ఉందురు ॥ గాలి ॥

4. ఏదో తెలియదు తుదిక్షణము
మాధవుడే తోడు అనుక్షణము
సాగాలి ఆరాధన ప్రతిక్షణము
ఆగాలి ఆవేదన ఆఖరిక్షణము ॥ గాలి ॥



## ౮౦. ఏదిరా! గోపాలా

**పల్లవి :** ఏదిరా! గోపాలా!
నాదలోల! నందబాల!
ఏదిరా గోపాల! ॥ ఏదిరా ॥

**అనుపల్లవి :** నిముషమైన నిను వీడని
అద్భుత అసమాన మురళి ॥ ఏదిరా ॥

**చరణములు :**

1. విరుల కురుల వగలు జూచి
వీచికలకు రుచులు పంచి
మది కరిగే మధురవార్త
మగువల కందించు మురళి
ఏదిరా గోపాలా!
గానలోల గోపాల! ॥ ॥ ఏదిరా ॥

2. గలగల మని కొలను జలము
పులకరించెను పూలవనము
వల పన్నిన రాధ వలపు
రాగమైన మురళి పిలుపు
ఏదిరా గోపాలా!
నాదవేద వేణునాద మేదిరా గోపాల! ॥



3. ఉన్నచోటే పరతు నీకు
పొన్నపూల శయ్య నేను
కలుగులు గల కన్నె మురళి
వెలుగులు విరజిమ్ము రవళి
ఏదిరా గోపాల!
విశ్వమోహన వేణుగాన మేదిరా గోపాల! ॥

4. దొరను చేరిన సుందరాంగి
తొంగి చూడదు దొంగ మురళి
విధి రాతకు ఎవరు బాధ్యులు?
ఉన్న వారికి లేవు బాధలు
ఏదిరా గోపాల!
వేదనాద సునాద మురళి ॥ ఏదిరా ॥



## 81. ఎంతని పిలిచేది?

**పల్లవి :**

ఎంతని పిలిచేది నిన్ను
ఎందుకు ఈ దూరం?

**అనుపల్లవి :**

మాయ లెరుగని పిచ్చిమనసుకు
ఎందుకు ఈ భారం? ॥ ఎంతని ॥

**చరణములు :**

1. కలువకు చంద్రుడు నేలకు మేఘుడు
దగ్గరున్నారా?
పంకజానికి తిమిర హరునికి
దూరము నిలిచిందా?
దూరము లేని భారము తెలియని
భక్తికి అడ్డుందా? ॥ ఎంతని ॥

2. పనులు నీ వరకే - నా పాటలు నీ కొరకే
పనిపాటలలో పొరలి వచ్చే మాటలు నీ కెరుకే
శ్వాసలన్నీ ఆగినా నా ఆశ నీ దరికే ॥ ఎంతని ॥



3. ఏనాడైనా కాలం లోనే పోతారందరు
పోయేకాలం రాలే దేహం తెలిసిన వారెవరు?
కాలే దేహం కాటి కేగినా కాలదు మన బంధం
॥ ఎంతని ॥

4. రాధను కాను యశోదను కాను
బాధగ మిగిలాను
బాధల వెలుగులో బ్రతుకును చదివి
బాగు గ్రహించాను
నీవే నేనని తెలిసే దాక చావక ఉంటాను
॥ ఎంతని ॥



## 82. మేలుకోరా జీవ! మేలుకో జీవ!

**పల్లవి :**

మేలుకోరా జీవ! మేలుకో జీవ!
మేలుకో సంజీవ! మేలుకో!

**అనుపల్లవి :**

మాయదారి యముడు మార్గాన యున్నాడు
మగత వీడి నీవు మేలుకో! ॥ మేలుకోరా ॥

**చరణములు :**

1.ఆలు బిడ్డలంచు అల్లాడు తున్నావు
కలసి ఎవరొచ్చారు మేలుకో!
కర్మము కలిసొచ్చి జీవి పోయేనాడు
తనువు కూడా రాదు మేలుకో! ॥ మేలుకోరా ॥

2. అన్నదమ్ములంచు ప్రాణంగా మసలేరు
మాయ లెరుగని నాడు మేలుకో!
మీసాలు రాగానే మోసాలు మొదలాయె
తోడెవరు నీకింక మేలుకో! ॥ మేలుకోరా ॥



3. పైసలుంటే చాలు పై ప్రేమలుంటాయి
కళ్ళు తెరచి నీవు మేలుకో!
విత్తము కారిపోగా చిత్తములు మారిపోవు
ఉండ రెవ్వరు తోడు మేలుకో! ॥ మేలుకోరా ॥

4. రాత్రనక పగలనక నీకు బోధించుటకు
చైతన్య గళముంది మేలుకో!
దీప మున్నపుడే దివి చేరిపోవాలి
జాగు చేయకు జీవ మేలుకో! ॥ మేలుకోరా ॥



## 83. బ్రతుకంతా ఎదురెండ

**పల్లవి :**

బ్రతుకంతా ఎదురెండ
నీవే ఉండాలి ఎదనిండా ॥ బ్రతుకంతా ॥

**అనుపల్లవి :**

మనసు కావాలి పూదండ
శోభించాలి నీ మెడ నిండా ॥ బ్రతుకంతా ॥

**చరణములు :**

1. ప్రేమే నా మనసు నిండా
అదేలే నీకు వెన్న కుండ
జుర్రాలి కడుపు నిండా
ఎన్నటికీ త్రేపకుండా ॥ బ్రతుకంతా ॥

2. మందైనా అది విందైనా
చేదైనా మరి ఏదైనా
చూపులు నీవి చేతలు నావి
చేతల వెనుక చేతులు నీవి ॥ బ్రతుకంతా ॥



3. బాట నీదే ఆట నీదే
ఆడించే అందము నీదే
మాట నీదే పాట నీదే
పాట లోని రాగము నీదే
రాగములో అనురాగము నీదే ॥ బ్రతుకంతా ॥

4. నిలువున్న ఋణము గాలి
నీవే బ్రతుకుకు వనమాలి
పాడాలి నీవే లాలి
రావాలి మాకు దీపావళి ॥ బ్రతుకంతా ॥





# ఊరేగే మేఘమాల

## ( చైతన్య గానం - 10 )

## 84. ఊరేగే మేఘమాల

**పల్లవి :**

ఊరేగే మేఘమాల
విని పోవే నా మనసు గోల ॥ ఊరేగే ॥

**అనుపల్లవి :**

నింగి కెగిరిన ఓ మేఘమాల
నేలను మరచెద వేల? ॥ ఊరేగే ॥

**చరణములు :**

1. దాగే గుణము అతని లీల
దాచే మనసు నీకు ఏల?
గగనమే అతని గూడు
కలిసొచ్చెలే నీకు జోడు ॥ ఊరేగే ॥

2. నీలిమబ్బుల కొంగును పరచి
నింగి రంగును అంచుగ మలచి
దాచావు అతని రూపు
దాచ గలిగావా నీలో మెరుపు ॥ ఊరేగే ॥



3. చల్లని నీళ్ళను ఉదరములో
నింపుకున్న జలధరమా!
వెచ్చని కన్నీళ్ళు కన్నులలో
నిలుపు కొనుట నా తరమా! ॥ ఊరేగే ॥

4. మనసున్న నీలాల మేఘమా!
మాధవుని గననీవమ్మా!
కరుణించవే కబు రందించవే
కడతేర్చవే నన్ను మేఘమా! ॥ ఊరేగే ॥





## 85. వినిపించలేదా కోనేటిదేవా

**పల్లవి :**

వినిపించలేదా కోనేటిదేవా
కన్నీటి నా గాథ

**అనుపల్లవి :**

అడుగు అడుగుకు కొండల స్వామి
దండము గైకొనవా! ॥ వినిపించలేదా ॥

**చరణములు :**

1. పలుకుచుంటిని పాడుచుంటిని
పలుకరింతు వని
పలుకుబడి గల బంగారు గుడిలో
పలుకే బంగారమా! ॥ వినిపించలేదా ॥

2. చెప్పుచుంటిని కథలను తీయగా
కనికరింతు వని
నామాల మాటున చూపును దాచితే
ఎవరితో మొర లిడుదు ॥ వినిపించలేదా ॥



3. దిక్కులు తిరుగుచు చిక్కులు పడితి
చిక్కెదవని నీవు
పరితపించుచు ప్రక్కన చేరితి
పరిహసించకయ్యా ॥ వినిపించలేదా ॥

4. ఆడాడ తిరిగి అలసి పోయాను
ఆదుకో స్వామీ
తిరుగుడు తల తిరుగుడు మాని
నీ గుడి తిరిగెదను ॥ వినిపించలేదా ॥



## 86. శ్రుతిసారం

**పల్లవి :**

శ్రుతిసారం తం గోవిందం వన్దే
రాధాసేవిత పాదాబ్జం భజేహం ॥ శ్రుతిసారం ॥

**చరణములు :**

1. నవఘన శ్యామం సురనుతపాదం శ్రీకృష్ణం
భజే శ్యామలం యదువంశనాథం శ్రీకృష్ణం
కస్తూరీతిలకం కారుణ్యారూపం శ్రీకృష్ణం
శ్రీకృష్ణం కృష్ణం కృష్ణం కృష్ణం . . ॥ శ్రుతిసారం ॥

2. భక్తిదాయకం ముక్తిసాధకం గోవిందం
వేదాంతసారం వాక్యవిచారం గోవిందం
అనంతానందం ఆనందదీపం గోవిందం
గోవిందం గోవిందం గోవిందం గోవిందం. .
॥ శ్రుతిసారం ॥



3.విశ్వకారణం విశ్వమోహనం వాసుదేవం
విశ్వపావనం విశ్వజీవనం వాసుదేవం
విశ్వనాయకం విశ్వమంగళం వాసుదేవం
వాసుదేవం వాసుదేవం వాసుదేవం వాసుదేవం. .
॥ శ్రుతిసారం ॥

4. కంజలోచనం అంబుజ వదనం గోపాలం
సుందర హృదయం సుఖకందం గోపాలం
భక్తవత్సలం భావవల్లభం గోపాలం
గోపాలం గోపాలం గోపాలం గోపాలం . . .
॥ శ్రుతిసారం ॥



## 87. గోవిందా! గోవిందా!

**పల్లవి :**

గోవిందా! గోవిందా! జన్మలన్నీ గోవింద!
జన్మలన్నీ గోవిందా! కర్మములన్నీ గోవింద!

**అనుపల్లవి :**

శరణన్న వారికి గోవిందా! గోవిందా!
మరణము గోవింద! జననము గోవిందా!
॥ గోవిందా ॥

**చరణములు :**

1.కేశవ నామంతో ఆశలు గోవింద
మాధవ స్మరణతో మమతలు గోవింద
బాధలు గోవింద బరువులు గోవింద
కష్టాలు నష్టాలు గోవిందా! గోవిందా! ॥ గోవిందా ॥

2. జన్మల బంధాలు గోవిందా గోవిందా
జీవుల సంబంధాలు గోవిందా గోవిందా
పటపటలు గోవింద చిటపటలు గోవింద
రుసరుసలు గోవింద గుసగుసలు గోవిందా!
॥ గోవిందా ॥



3. గోవిందా గోవిందా గొడవలన్నీ గోవింద
తాపాల సంతాపాల కడవలన్నీ గోవింద
ఆగడాలు గోవింద జగడాలు గోవింద
మేడలు గోవింద గాలిమేడలు గోవిందా!
॥ గోవిందా ॥

4. లోకము గోవింద శోకము గోవింద
పాపము గోవింద శాపము గోవింద
చేతి గీత గోవింద నొసటి రాత గోవింద
ఆశలు గోవింద పేరాశలు గోవిందా!
॥ గోవిందా ॥



## 88. సంసారమె సంగ్రామము

**పల్లవి :**

సంసారమె సంగ్రామము
తెగిన ప్రేగు అనుబంధము
జీవుల ఆరాటము
జీవన పోరాటము ॥ సంసారమె ॥

**చరణములు :**

1. కలిపిన దెవరో కలిసే దెవరో
కలహాలను కనిపెట్టిన దెవరో
కయ్యానికి కాలు కదపని వారెవరు
తగవులకు అందరు తగుదుము అందురు
॥ సంసారమె ॥

2.సమర నదిలో మమకార జలము
ఎవరినైనా ముంచుట సత్యము
ఎంత ఈదినా తెలియదు తీరము
ముందు వెనుక గాఢాంధకారము ॥ సంసారమె ॥



3.ఆశల అలలు నిరాశల నీడలు
కనుల ముందే కరుగును కలలు
ప్రియములు, ప్రేమలు మంచుకొండలు
చుట్టరికాలు ఎండమావులు ॥ సంసారమె ॥

4.ఆరక పోదు వెలిగే దీపం
ఆర దెన్నడూ ఆత్మదీపం
జగతికి వేదము పంచిన జ్ఞానము
సుగతిని తెలిపే అమృత గానము ॥ సంసారమె ॥



## 89. వద్దురా కన్నయ్యా!

**పల్లవి :**

వద్దురా కన్నయ్యా!
నన్నొదిలి పోవద్దురా కన్నయ్యా! ॥ వద్దురా ॥

**అనుపల్లవి :**

వేడే వారిని వీడని వారిని
ఏడిపించే వేడుక ॥ వద్దురా ॥

**చరణములు :**

1. నా బ్రతుకే పూచిన మల్లిక
ఏనాడో నీకది కానుక
నిత్యమై నిలవాలి వాడక
వాడే ఊడే ఓడు జీవితం ॥ వద్దురా ॥

2. భక్తియే నా నివేదిక
ఋజువేదీ మరి లేదిక
నిజమేదో నీకే ఎరుక
నీ దాసునిపై కినుక ॥ వద్దురా ॥



3. రహదారి ఏదని గిరిధారి నడిగితే
గోదారి చూపుట న్యాయమా?
నిన్నే మదిలో కొలిచే వారికి
తీరని బాధలు ఆరని కన్నీరు ॥ వద్దురా ॥

4. కన్నతల్లి విడిచి పోయినది
మన్ను తల్లి వేచి యున్నది
కన్నులలో నీవు కరువైన నాడు
మహిలో మనుగడ ॥ వద్దురా ॥



## 90. పాడనీ నా మనసారా!

**పల్లవి :**

పాడనీ నా మనసారా!
నిను గాంచనీ నా కనులారా! ॥ పాడనీ ॥

**చరణములు :**

1.గళమున సొగసు మాయక మునుపే
రాగ భావములు చెదరక మునుపే
బొంగురు గొంతును బడయక మునుపే
స్వర సంచారము ఆగక మునుపే ॥ పాడనీ ॥

2. కంటిలో వాడి తరగక మునుపే
కనుపాప ఒడలు విరగక మునుపే
సృష్టి అందాలు గాంచిన కనులు
కుడ్య రంధ్రాలుగా మారక మునుపే
గాంచనీ నా కనులారా
నిను గాంచనీ నా కనులారా ॥ పాడనీ ॥



3. పోయింది రాదు వచ్చేది తెలియదు
ఉన్నదే తోడు అన్నది నిజము
శ్రుతి చేసినది తెలియని పున్నెము
హృది పాడినది కమ్మని గీతము ॥ పాడనీ ॥

4. సుఖములు కోరను సుజనుల వీడను
సమభావములతో సంతస మొంది
యెదలను తడిపే సుమధుర గీతలు
గానము చేయుచు తరియించెదను ॥ పాడనీ ॥



## 91. జో అచ్యుతానంద

**పల్లవి :**

జో అచ్యుతానంద! జోజో ముకుంద!
లాలి పరమానంద! శ్యామగోవింద!
జో... జో...

**అనుపల్లవి :**

మా నల్లనయ్యకు నిదుర రాదేమి?
ఎటు పోయెనో మనసు ఎవరు పిలిచారో!
॥ జో అచ్యుత ॥

**చరణములు :**

1.విశ్వమంతా నీకు ఊయలగ జేసి
వేదములు నాలుగు గొలుసులుగ గట్టి
పాలసంద్రమును పడకగా జేసి
చందమామను చిలుక పందిరిగ నుంచి
కనులార నిను జూచి తనివి తీరగను
ఊగేటి మనసుతో ఊపెదము నిన్ను
॥ జో అచ్యుత ॥
జో... జో...



2. చూడ చక్కని చుక్క రాధ పిలిచిందా
చూడ లేదని బుజ్జి దూడ అరిచిందా
గొల్లపిల్లల గోల గుర్తుకొచ్చిందా
కునుకు ఎందుకు రాదు మము గన్నతండ్రి
నిదురపో కన్నయ్య నిదుర పోవయ్య
నిను జూచి జాబిలికి కన్ను కుట్టేను
॥ జో అచ్యుత ॥

3.నారదుని నాదము మాకు రాదయ్యా
తుంబురుని తాళము నేర్వ లేదయ్యా
సనకాదుల స్వరము మాకు లేదయ్యా
బుద్ధిగా భక్తితో వేడెదము స్వామీ
కనుమూసి కల లోకి జారి పోవయ్యా
కల లోన గోపెమ్మ లెదురు జూచేరు
॥ జో అచ్యుత ॥
జో... జో...



# చందమామ రావే!

## (చైతన్య గానం - 11)

## 92. చందమామ రావే !

**పల్లవి :**

చందమామ రావే! జాబిల్లి రావే!
అవనికి రావే! అమృతము తేవే!
చందమామ రావే జాబిల్లి రావే!
కొండ నెత్తిన స్వామి అండ జేరిపోవే ॥చందమామ॥

**చరణములు :**

1.నింగిలో దోగాడే ఓ చందమామ
నేల నున్న మాపై ఎందు కంత ప్రేమ?
వేడిమి భరించి వెన్నెలలు పంచి
మంచి చేశావు మామ వయ్యావు ॥ చందమామ ॥

2.దోబూచులాడే ఓ చందమామ
కొండస్వామితో మనము ఉండి పోలేమా!
తెల్లని వెన్నెల నెలరాజ రావోయి
దినరాజు రాగానే తెల్లవారు నోయి ॥చందమామ ॥



3. చీకట్లు ముసిరిన మా బ్రతుకులలో
చల్లని వెలుగుల వెన్నెలలు రానీ
దొర్లి దొర్లి రావే పూలచెండు లాగ
ఉండి పోవే ఇలలో పసిడికొండ లాగ
॥ చందమామ ॥

4. కారే రాజులు రేరాజు నీవే
నల్లనయ్య సరసన నిను చూడనీవే
పెరుగుట తరుగుట నీకేల దేవా?
నిరతము నిండుగ ఉండి పోలేవా?
॥ చందమామ ॥



## 93. మనసా! తెలుసా!

**పల్లవి :** మనసా! తెలుసా!

సొగసుండదు కలకాలము ॥ మనసా ॥

**అనుపల్లవి :** గాలి ఒకచోట నిలుచునా

వయసైనా అంతేలే ॥ మనసా ॥

**చరణములు :**

1. కళకళలాడే కాయాలు

ఉంటాయా శతమానాలు

మిలమిల మెరిసే నయనాలు

చూస్తాయా పది కాలాలు

తళతళలాడే రూపాలు

కాలే మతాబులు . . . . . ॥ మనసా ॥

2. సాగే బ్రతుకు నావలు

చేరాలి జీవన తీరాలు

తప్పవు దూరభారాలు

మోయాలి బ్రతికి నన్నాళ్ళు

దారిలో ఎన్నో గండాలు

జీవన సుడిగుండాలు . . . . . ॥ మనసా ॥



3. వెలిగే దీపము ఈ క్షణము

ఆరిపోవును మరుక్షణము

ఆడే ప్రాణము క్షణక్షణము

ఆగిపోతే తుది క్షణము

నిగనిగలాడే శరీరము

మట్టికి మణిహారము . . . . . ॥ మనసా ॥

4. కడలి లోని కెరటాలు

నిలుపునా ప్రతిబింబాలు

పగిలిన అద్దపు తునకలు

చూపునా మన రూపాలు

కడ తెలియని లోకము కడలి

ముంచునులే పొరలి . . . . . ॥ మనసా ॥





## 94. ఎవరిదో ఆ తీయని పిలుపు

**పల్లవి :**

ఎవరిదో ఆ తీయని పిలుపు
ప్రేమకే కనుచూపు
క్షణమైనా మరపురాని
మధురమైన తలపు ॥ ఎవరిదో ॥

**చరణములు :**

1. ఆకులలో పచ్చదనం
అర్కునిలో వెచ్చదనం
చంద్రునిలో చల్లదనం
తేనెలలో తియ్యదనం
పాపల చిరుచిరు నవ్వులలో
పలకరించే పిలుపు
క్షణమైనా మరపురాని
మధురమైన తలపు ॥ ఎవరిదో ॥

2. కడలిలో కెరటాలు
దీపాల కిరణాలు
నోటిలో కిలకిలలు
ఏటిలో గలగలలు
పాల నురుగు లోని తెలుపు
కనుపాప లోని నలుపు
క్షణమైనా మరపురాని
మధురమైన తలపు ॥ ఎవరిదో ॥



3. సన్నగాలి సరదాలు
సన్నజాజి సరసాలు
వెన్నెలల సందడులు
తుమ్మెదల సవ్వడులు
యమునా జలాల కలగలపు
మురళి తల్లి పిలుపు
క్షణమైనా మరపురాని
మధురమైన తలపు ॥ ఎవరిదో ॥

4. ఆ పిలుపే మనసుకు మలుపు
జగతి లోన తనదే గెలుపు
ఔనన్నా కాదనుకున్నా
లోకానికి తానే వేలుపు
బోధను పంచి బరువును దించే
గీతాచార్యుని పిలుపు
క్షణమైనా మరపురాని
మధురమైన తలపు ॥ ఎవరిదో ॥

## 95. చూడు ఇదే నీ లోకం

**పల్లవి :**

చూడు ఇదే నీ లోకం - మనసా
మనసా - ఓ మనసా - నా మనసా ॥ చూడు ॥

**అనుపల్లవి :**

తిరిగి రాదు పోయిన సమయం
ఎటు పోతుందో పయనం - మనసా ॥ చూడు ॥

**చరణములు :**

1.వీచే మమతల గాలుల నమ్మి
ఆడే తీగలా ఊగిపోయావు
వీచింది పెనుగాలి కూలింది బ్రతుకు
తెలియక మోసపోయావు - మనసా॥ చూడు ॥

2. కోరిన దేదీ దొరకని బాల్యము
ఆశల ఊబిలో మునిగిన పరువము
సాగింది కాలము సడలింది దేహము
ఎపుడూ నిరాశే తోడు - మనసా॥ చూడు ॥



3. ఏదో రాదు ఎక్కడో లేదు
వెలుపల లేవు వేదనలు
సంద్రములోనే సుడి లేచింది
అంతా నీలోనే ఉంది - మనసా ॥ చూడు ॥

4. ఎగసిన అలలు నది యెదలోనే
కదలిన అలజడులు మదిలోనే
పుట్టిన నది లోనే పడతాయి అలలు
పుట్టిన చోటికే చేరిపో - మనసా॥ చూడు ॥



## 96. గాలితో కలసి

**పల్లవి :**

గాలితో కలసి గువ్వలాగా గంతు లేయాలని
నీటిలో చేరి చేపపిల్లనై ఈదు లాడాలని

**అనుపల్లవి :**

వెన్నెలతో కూడి తారనై తిరగాలని
అంతటా నిన్ను అలా చూస్తూ
మూయాలని కనులు ॥ గాలితో ॥

**చరణములు :**

1. మధువనంలో పువ్వునై విరబూయాలి
పువ్వులో తావినై అంతటా గుబాళించాలి
నువ్వు నా వాడివని ఎవ రడిగినా చెప్పాలి
దూరమై నీకు బ్రతక లేనని చెప్పి తీరాలి
మన బంధము తెగేది కాదని చెప్పాలి
ఏది ఏమైనా నీ ఒడిలో ఒరగాలి తనువు
॥ గాలితో ॥



2. కవి కలంలో కవితగా పొంగి పారాలి
కవితలో హృదయమై పరవశించాలి
హృదయగుడిలో వీణనై నేనుండాలి
నీవు మీటితే రసరాగాలు పలకాలి
రాగాలే సుధలై ఎదలో చిలకాలి
పల్లవేదైనా నీ చరణమె కావాలి శరణం
॥ గాలితో ॥

3. ఆట లాడాలని తోటలో నిన్ను కలిశాను
ఆడుతూ ఆటలో బొమ్మగా నన్ను మలచావు
ఆడమన్నావు ఆట రాక నిలిచాను
ఆడలేదని అందరిలో నిలదీశావు
ఆట ఏమైనా బాట లోనే నేనున్నాను
గెలిచినా ఓడినా నేను బొమ్మనే ఆట నీదేలే
॥ గాలితో ॥



## 97. రణమే బ్రతుకంతా

**పల్లవి :**

రణమే బ్రతుకంతా
ఋణమే జీవన సంత
అంతా ఒకటే చింత
జగమంతా ఇదే వింత ॥ రణమే ॥

**చరణములు :**

1. పోయే పరువులు చేరే అరువులు
కరువులే జీవికి అంతా
ఆశల వేడుకలు నిరాశల ఏడుపులు
వీడవు జీవిత మంతా ॥ రణమే ॥

2. ఆగదు బేరము సాగదు లాభము
ఆరాటమే వ్యాపార మంతా
సారము కానిది పారము లేనిది
నిస్సారమే సంసార మంతా ॥ రణమే ॥



3. కానల విరిసిన వెన్నెలలా
మనసున పూచిన ఆశలు
పడిగాపుల పందిరి మాటున
చితికిన యెదల పొదలు ॥ రణమే ॥

4. తుది ఊపిరి విడిచే లోగా
అది ఎక్కడో తెలియాలి
ఆదిదేవుని అండ దొరికితే
రణములన్నీ విజయాలే
ఋణములన్నీ వీడుకోలే ॥ రణమే ॥



## 98. జ్ఞానమె నీ నావ

**పల్లవి :**

జ్ఞానమె నీ నావ - ధన్యము నీ త్రోవ
సంసార జలధిలో మేలైన నావ ॥ జ్ఞానమె ॥

**చరణములు :**

1. ఎక్కడి కేగినా - ఎంతగా తిరిగినా
నావ తీరానికి - కాయము కాటికి ఖాయము
॥ జ్ఞానమె ॥

2. లేనిది కాదులే - క్రొత్తగా రాదులే
ఉన్నదే తెలియాలి - జ్ఞానమే దీపమై వెలగాలి
॥ జ్ఞానమె ॥

3. నమ్మిన వారికి - చల్లని యానము
నడిచే వారికి - విలువైన నెలవైన తీరము
॥ జ్ఞానమె ॥



4. కలతల లోకాలు - కన్నీటి శోకాలు
బాధల పవనాలు - కనలేని రమణీయ తీరాలు
॥ జ్ఞానమె ॥



## 99. వృథా చేయబోకు

**పల్లవి:**

వృథా చేయబోకు - జన్మము
సదా రాదు నీకు - ఈ జన్మము
సదా రాదు నీకు ॥ వృథా ॥

**చరణములు:**

1. ఉత్తమ జన్మమురా - దీనిని
వ్యర్థము చేయకురా
ఉత్త సంసారమురా - రేపది
మృత్యురూప మౌరా ॥ వృథా ॥

2. ఏవేవో చదివి - ఊరక
వాదు లాడబోకు
సాధు సేవ లేక - రేపది
బోధకు రాబోదు ॥ వృథా ॥



3. మూడు గుణంబులలో - నీవు
ముక్తుడ గారాదా
పాడు ఘటము గాదా - రేపది
భస్మమై పోదా ॥ వృథా ॥

4. అంతా నటనేరా - ఈ లోకము
నరకము చూపునురా!
పెద్దల మార్గములో నడచి
సిద్ధిని పొందుమురా ॥ వృథా ॥



మనసు లోనిది మాట
గొంతులో అది పాట
రాగాలు, సరాగాలు కలబోసిన మూట
మదిలో మాధవుని దాచేందుకు కట్టని కోట.
భావాల కోట
రాగాల బాట
పాటల పూదోట
విహరించే మనసుకి పరచిన పువ్వుల బాట.
పున్నమి ఆట.
ఆడుకో, పాడుకో.
సౌరరూపుడైన సామగానలోలుని
సరిగమల వెనుక సరిగ, సమంగా దర్శించుకో.

సర్వే భద్రాణి పశ్యన్తు!

